## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం · 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938-1972]

శుక్రవారం : 17-12-'76
నలనామ సం. మార్గశిర బ. నవమి
సంపుటము 70 : సంచిక : 16

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

పోస్ట్‌లో ఏడాది చందా రు. 41-60
" ఆరుమాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520003.


## విషయానుక్రమణిక



కథలు :



సీరియల్ కథలు :



వ్యాసాలు, శీర్షికలు :

# ఉత్తరాలు

## అట్టమీద బొమ్మ

9.11.76 తేదీన వెలువడిన మీ ఆంధ్ర సచిత్ర వార పత్రిక చాల రమణీయంగా ఉంది. అట్టమీద బొమ్మ మురళీమోహన్ జయచిత్రల యుగళం కొత్తతరహాలో ఉంది. కిటికీ కావాక్షి, నల్లగులాబి కథలు చాలా బాగున్నాయి. ముఖ్యంగా ముఖచిత్రం విషయంలో మీరు తీసుకుంటున్న శ్రద్ధ చాల అమోఘనీయం. సామాన్యుని సణుగుడు శీర్షిక "మన క్రీడాభంగం ఎన్నాళ్ళు."చాల బాగుంది. ఎన్ని ఏమయినా మీరు ముఖ చిత్ర విషయంలో చాల శ్రద్ధ తీసుకుంటున్నారు. మీకు మా ధన్యవాదాలు.

టి. రవీంద్రనాథ్ (అనంతపురం)

## కథలు

ఈ వారం 12.11.76 పత్రికలో కథలురెండు చాలా బాగున్నవి. సీరియల్స్‌లో "డాక్టర్ వనిత" మమ్మల్నెంతో ఆకర్షిస్తోంది. రచయితగార్కి మా యొక్క థాంక్స్.

కె. చిన్నయ్య, వై. అశోక్‌కుమార్, (గన్నేరువరం)

* * *

19.11.76 ఆంధ్రసచిత్రవారపత్రికలో చొక్కాపు వెంకటరమణగారి, "కిటికీ కావాక్షి" కథ నా కళ్లంబడి నీరు రప్పించింది. గుండెనొప్పితో గిలగిలలాడిపోతున్న చలపతిని చూస్తూ ఊరుకున్న సుబ్బారావుమీద మాకు చాలా కోపం వచ్చింది. చలపతి పాత్ర కలకాలం మా మనస్సులకి చోటు చేసుకునే విధంగా రచించారు. రచయిత చొక్కాపు వెంకటరమణగారికి మా (మీ) పత్రికా ముఖంగా అభినందనలు తెలియచేస్తున్నాను. అన్ని హంగులతో వున్న సినిమా విశేషాలు మాకు తెలుపుతున్న సినిమా శ్రీనివాస్‌గారి ఫోటో ఒకసారిచూపించరూ

పి. ఎ. ఎల్. సంజీవరావు, పి. వి. రామనాథ రావు, పి. వేణుగోపాల్, పి. వాసంతి,(నేలకొండపల్లి)

## ప్రశ్నావళి

కథలన్నీ చాలా చాల బాగున్నాయి. ముఖ్యంగా కె. రామలక్ష్మిగారి జవాబులు మరీ మరీ బాగుంటున్నాయి. అనటంలో సందేహం లేదు. పోతే నిత్య జీవితంలో ఎంతో అవసరం అనిపించే విషయాలు డాక్టరుగారి సలహలు, పత్రికకే హైలైట్ అనటంలో అతిశయోక్తి లేదు. డాక్టరు వనిత సీరియల్ స్వీట్, హాట్‌గా ఉంది. గంటివెంకటరమణ గారికి మా అభినందనలు అంత మంచి సీరియల్ మాకు అందిస్తున్నందుకు.మొత్తం పై సీరియల్ చాలా బాగుంది.

ఎం.బాషా, ఎం.రజియా, ఎం.మున్ని. (కర్నూలు)

(50వ పేజీ చూడండి)

లోకం పోకడ — ఊమెన్



# ఆమెకేం కావాలి?

బొడ్డపాటి సర. గౌరీదేవి

*(గత సంచిక తరువాయి)*

మళ్ళీ రొటీన్‌లో పడిపోయాడు లక్ష్మణ్.

ఆఫీసు వదలగానే ఇళ్ళకోసం వేట ప్రారంభించేవాడు.

ఒకరోజు ఓ ఇల్లు చూసి అడ్వాన్స్ ఇచ్చి వస్తూంటే దారిలో ఉదయ్ ఎదురు పడ్డాడు. లక్ష్మణ్‌ని చూడగానే కారాపి ఎక్కించుకున్నాడు.

"ఏమిటి ఈ రోజు ఓవర్ టైమ్ వర్క్ చేసావా? ఇంత ఆలస్యమయింది?" అడిగాడు.

లక్ష్మణ్ తల అడ్డంగా ఊపి, "అదేం లేదు. చెప్పానుగా మా మామయ్యగారి అమ్మాయీ, మా బామ్మగారూ నా దగ్గరికి వచ్చేస్తున్నారని! అందుకని కాస్త పెద్ద పోర్షన్ కోసం వెతికి ఈ రోజే ఒక ఇంటికి అడ్వాన్స్ ఇచ్చి వస్తున్నాను. మన భాగ్యనగరంలో ఇళ్ళు అద్దెకు దొరకటం మాత్రం చాలా కష్టం. ముఖ్యంగా మనకు కావలసిన వసతులతో. ఆడవాళ్ళు కదూ వంటిల్లూ, నీళ్ళగదీ. వసతిగా విడిగా ఉండకపోతే తప్పదు. అవికాక వాళ్ళ గోగది నాకోగదీ... ఓహ్ ఈ పది రోజులుగా విసిగి వేసారి పోయాననుకో" అలసిపోయినట్లు అన్నాడు.

ఉదయ్ నవ్వాడు. "ఏమి టోయ్! పెళ్ళయి సంసారం పెట్టేస్తున్నంత హైరానా పడిపోతున్నావు?" అతని దగ్గర్నుండి ఏదో రాబట్టే ధోరణిలో అన్నాడు.

లక్ష్మణ్ నవ్వి ఊరుకున్నాడు. "అదృష్టం బాగుంటే ఆ పనే జరిగి ఉండేది. ఇప్పుడేమనుకుని ఏం లాభం?!" అనుకున్నాడు.

"ఏన్నే! పెళ్ళి కుదిరిందా?" ఉదయ్ రెట్టిస్తూ ఈసారి సూటిగానే అడిగాడు.

"ఆహా! అదేం లేదు. ఇప్పట్లో ఆ ఉద్దేశ్యం పెట్టుకోదల్చుకోలేదు. మొన్ననే మామయ్య పోయారు కదా!"

"అంటే మీ మరదలు అయన పోయిన దుఃఖం నుండి కోలుకునే దాకా చేసుకోరా?" ఉదయ్ జాగత్తగా రోడ్డు వంక చూసి డ్రైవ్ చేస్తూ అడిగాడు.

లక్ష్మణ్ తడబడి "అందుకోసం కాదు. సంధ్యకి నేను తగను. నా కంటే మంచి సంబంధాలే వస్తాయి కాస్త ప్రయత్నిస్తే! పోతే నేను మాత్రం నువ్వన్నట్లు మామయ్య పోయిన దుఃఖం నుండి పూర్తిగా తేరుకున్న తరవాతే పెళ్ళి గురించి ఆలోచిస్తాను" అన్నాడు. ఇంతలో అతని గది రావటంతో

సంభాషణ అంతటితో ఆగిపోయింది.

సంధ్యా, సరస్వతమ్మగారూ వచ్చేసాక ఇల్లంతా సందడిగా అనిపించింది లక్ష్మణ్‌కి. క్రొత్త ప్రదేశం, క్రొత్త వాతావరణం సంధ్యలోనూ ఉత్సాహాన్ని పెంపొందించాయి. మాట్లాడుకోటానికి మరెవరూ లేకపోవటంతో ఇదివరకు లాగానే ఇద్దరూ కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ ఉండేవాళ్ళు సంధ్య, లక్ష్మణ్.

ఓ రోజు సాయంత్రం కాగితం, కలం పట్టుకొచ్చి లక్ష్మణ్ ఎదురుగా కూర్చుని జమా ఖర్చుల పట్టీ తయారుచేసి "చూడు బావా ఇందులో ఏ ఖర్చైనా తగ్గించగలవేమో!" అంటూ అతని చేతికి కాగితం అందించింది సంధ్య.

లక్ష్మణ్ జాగత్తగా దాన్ని పరిశీలించి నవ్వుతూ తలెత్తి, "చాలా చక్కగా తయారు చేసావు సంధ్యా! ఇందులో అనవసరమైన

> ***జరిగినకథ 2:*** గోపాలరావు గారి కూతురు సంధ్య. తనకు ఆరోగ్యం బాగుండలేదని ఓసారి రమ్మని తనని పెంచి పెద్దచేసిన మామయ్య గోపాలరావుగారు వ్రాయటంతో వెంటనే బయల్దేరి వెళతాడు లక్ష్మణ్. సంధ్యని పెళ్ళిచేసుకోవాలనుకుంటాడు లక్ష్మణ్. తను తన భర్తా కార్లలో తిరగాలనీ బంగళాల్లో వుండాలనీ కలలు కంటుంది సంధ్య. సంధ్య కోరుకున్నట్లుగా ఆమె వివాహం జరిపిస్తానని లక్ష్మణ్ దగ్గర మాట తీసుకుని కన్ను మూస్తారు గోపాలరావుగారు.

ఖర్చులుంటే కదూ తగ్గించటానికి! మొత్తానికి పక్కా గృహిణి ధోరణి వచ్చేసింది సుమా నీకు!" అన్నాడు.

సంధ్య ఒక్క క్షణం గంభీరంగా ఉండిపోయిందెందుకో. అంతలోనే నవ్వేస్తూ "గృహిణి ధోరణి రావటం మాట అటుంచు. ముందు నన్ను కాలేజీలో చేర్పించు" అన్నది.

"ఆ విషయం నేను మర్చిపోలేదు సంధ్యా! కానీ అన్ని కాలేజీల్లోనూ అడ్మిషన్స్ అయిపోయాయి. ఇక ఈ ఏడాది ఎవర్నీ చేర్చుకోరు. కాని ఏడాది వృథా చేసుకోటం మంచిది కాదు కనక ఈ సంవత్సరం ఏదైనా ట్యుటోరియల్ కాలేజీలో చేరి కోచింగ్ తీసుకొని పరీక్ష వ్రాయి. పై సంవత్సరం కాలేజీలో చేరవచ్చు" అన్నాడు లక్ష్మణ్.

సంధ్య అతని వంక చూసి నవ్వి, "నువ్వు కూడా ఇంట్లో కోచింగ్ ఇస్తానని మాట ఇస్తేనే చేర్తాను" అన్నది.

లక్ష్మణ్ భయపడ్డట్లు ముఖం పెట్టి, "నేనా?! ఎందుకు తల్లీ మళ్ళీ ఫెయిలయితే నా కోచింగ్ బాగులేదని నా మీదనే నేరం పెట్టడానికా?" అన్నాడు.

"నీ వాలకం చూస్తే నేను పాసవుతాననే నమ్మకం ఏకోశానా ఉన్నట్లులేదు. అవునా?" ఓరగా చిరుకోపంగా చూస్తూ అన్నది సంధ్య.

"ఎలా ఉంటుంది చెప్పు? మొదటి తరగతి నుండీ నీ ట్యూషన్ మాస్టర్‌ని నేనే కదు! ఒక్కో పాఠం నాలుగు రోజులు చెప్తే గానీ నీకు అర్థం అయేది కాదు. లెక్కలైతే మరీ ఘోరం. ఒక్కొక్క లెక్కా నాలుగ్గంటలు చెప్పాల్సి వచ్చేది. గుర్తులేదూ!" లక్ష్మణ్ అప్పటి రోజులు తలుచుకుంటూ ఉత్సాహంతో అన్నాడు.

"ఎందుకు గుర్తు లేదు? నువ్వు పది నిమిషాల కొకటి చొప్పున బహూకరించిన మొట్టికాయలు కూడా గుర్తున్నాయి" సంధ్య నవ్వింది.

"అప్పుడలా శిక్షించబట్టే ఎక్కడా డుమ్కీలు కొట్టకుండా పి. యు. సి. పూర్తి చేయగలిగావు. వద్దు బాబూ వద్దు. ఇప్పుడలా చెప్పే ఓపికా, శిక్షించే ఓపికా రెండూ లేవు నాకు" లక్ష్మణ్ బెదురు బెదురుగా అంటూంటే సంధ్య పకపకా నవ్వింది. అతను కూడా ఆమెలో శ్రుతి కలిపి ఏదో అనబోతూండగా బయట కారాగిన చప్పుడు వినిపించింది. లక్ష్మణ్‌కి వచ్చిందెవరో తెలిసి

పోయింది. సంధ్య మాత్రం కుతూహలంగా కిటికీ దగ్గరికి నడిచి బయటికి చూసింది. ఫుల్‌ట్రేడ్ సూట్‌లో కారు తాళాలు వేసి హుందాగా నడిచి వస్తున్న ఉదయ్‌నీ, అతని గ్రే కలర్ అంబాసిడర్ కారునీ ఒక క్షణం మార్చి మార్చి చూస్తూ ఉండిపోయింది. సరిగ్గా తను కలల్లో ఊహించుకున్నలాటి కారు! అయితే దాని స్వంతదారు తన బావ లక్ష్మణ్ కాదు.

''హల్లో లక్ష్మణ్ ! ఏమిటి తీరిగ్గా కూర్చున్నావు? ... ఓహ్! ఇంటి డెకరేషన్ ఎంత బాగుంది! నాకు తెలుసు నీకింత ప్రతిభ లేదని. ఏదీ మీ మామయ్యగారమ్మాయిని పిలువు. మొదట ఆమెని అభినందించి గానీ కూర్చోను'' అంటున్న ఉదయ్ మాటలకి సమాధానంగా లక్ష్మణ్ నవ్వుతూ.

''కాస్త పరీక్షగా చూడు. ఈ గదిలో నీ ఎదురుగానే ఉంది'' అన్నాడు.

ఉదయ్ కాస్త ప్రక్కకి తిరిగి సంధ్యని చూసి క్షణం పాటూ కళ్ళు తిప్పుకోలేక పోయాడు. లక్ష్మణ్ అతని వంకే చూస్తున్నాడు. అతనికి తెలుసు సంధ్యని చూసిన ఎవరైనా రెండో చూపు చూడకుండా ఉండలేరని. సంధ్య మాత్రం చాలా ఇబ్బందిగా నిల్చుంది. 'ఇతనెంత సునిశితంగా పరిశీలిస్తాడు' అని మనసులోనే ఆశ్చర్యపోతూ.

లక్ష్మణ్ ఆమె పరిస్థితి అర్థం చేసుకున్నవాడిలా వాళ్ళిద్దర్నీ ఒకర్నొకరికి పరిచయం చేశాడు. ''ఈమె మా మామయ్యగారమ్మాయి సంధ్య ఉదయ్!, సంధ్యా! ఇతను నాకీ ఊర్లో ఉన్న ఒకే ఒక ప్రాణస్నేహితుడు. డాక్టర్ ఉదయ్ శంకర్. ప్రైవేట్ ప్రాక్టీషనర్!''

సంధ్య వినయంగా నమస్కరించింది. ఉదయ్ ప్రతి నమస్కారం చేసి ''మిమ్మల్నెలా అభినందించాలో తెలీటం లేదు. చాలా బాగా అలంకరించారు. ఆ పెయింటింగ్స్ మీరు హాబీగా కలెక్ట్ చేసినవా లేక మీరే వేశారా ?'' అడిగాడు.

''నేనే వేశానండీ!'' సంధ్య సిగ్గుపడుతూ చెప్పింది. ఉదయ్ చురుక్కైన కళ్ళు మెచ్చుకోలుగా ఆమెని చూశాయి.

''నిజం ?! చాలా బాగా వేశారు. మొదట రాగానే ఇది ఇల్లా లేక ఆర్ట్‌గాలరీనా అని ఆశ్చర్యపోయాననుకోండి.'' అన్నాడు నవ్వుతూ.

లక్ష్మణ్ అతనింకా నిల్చునే ఉండటం చూసి చనువుగా భుజం మీద చెయ్యివేసి అదిమి కుర్చీలో కూలేసి సంధ్య వంక తిరిగి, ''సంధ్యా! ఈయనగారి పొగడ్తలన్నీ నిజమే ననుకునేవ్! వాడి తరహానే అంత! మొదట్లో నేను పరిచయం అయినప్పుడు నన్ను కూడా అలాగే ఆకాశానికెత్తేసాడు. నన్ను చూస్తే స్నేహం చేయాలని పదేపదే అనిపించిందట. నా పేరులాగే నా రూపం కూడా తనకి చాలా నచ్చిందిట! ఉండుండు. వాడు వాడిన పదాలే చెప్తాను. మా మొదటి కలయికకీ, రెండోసారి కలుసుకోటానికీ మధ్యనున్న కాలమంతా ఆషాఢమాసపు విరహాన్ననుభవించే కొత్త పెళ్ళికొడుకుకంటే రెట్టింపు విరహ బాధ ననుభవించాడట'' లక్ష్మణ్ చెప్తుంటే ఫక్కున నవ్వేసింది సంధ్య. ఉదయ్ కూడా నవ్వి, లక్ష్మణ్ అరచేతిని నొక్కుతూ, ''వీడు చెప్పినదంతా నిజమేనండీ! కానీ అవి నాలిక చివర్నుండి వచ్చిన మాటలు కావు. మనసులో నుండి వచ్చిన మాటలు. ఇప్పుడు సంధ్యకి అందజేసినది కూడా హృదయ పూర్వక అభినందనలే లక్ష్మణ్'' అన్నాడు. అతని కళ్ళల్లో నిజాయితీ తొణికిసలాడుతోంది.

సంధ్య కాఫీ కలపటానికి లోపలికెళ్ళింది. ఆమె మళ్ళీ వచ్చేసరికి రాజకీయాల మీద అనర్గళంగా చర్చించుకుంటున్నారు లక్ష్మణ్ ఉదయ్. వాళ్ళని డిస్టర్బ్ చేయకుండా కాఫీ కప్పులు ఇద్దరి మధ్యా వున్న బల్లమీద పెట్టేసి వచ్చింది.

కాస్సేపయాక లక్ష్మణ్ లోపలికొచ్చి, ''సంధ్యా! అతను వెళ్తున్నాడు. నీతో చెప్పి వెళ్దామని వెయిట్ చేస్తున్నాడు. ఒకసారి బయటికి రా!'' అన్నాడు ముందు గదిలోకి వస్తూ. సంధ్య అతని వెనకే బయటికి వచ్చింది. ఆమెను చూడగానే ఉదయ్ స్నేహపూర్వకంగా నవ్వి. ''వెళ్తొస్తాను సంధ్యా! ఈ ఆదివారం మీ యిద్దర్నీ మా యింటికి తీసుకెళ్తాను. మా తమ్ముడి భార్య గీత చుట్టు ప్రక్కల మంచి స్నేహితులెవరూ లేరని ఒకటే గొడవ పెట్టేస్తోంది. మిమ్మల్ని పరిచయం చేస్తాను. రెడీగా ఉండండేం?'' అన్నాడు.

''అలాగే!'' సంధ్య సంతోషంగా చెప్పింది.



ఉదయ్ ఆమె దగ్గర మరోసారి సెలవు తీసుకుని, లక్ష్మణ్ చెయ్యి పట్టుకుని కారు దాకా తీసుకెళ్లాడు.

"లక్ష్మణ్! నీ శ్రేయోభిలాషిగా నే నో

## ఆమెకేం కావాలి?

సలహా చెప్పనా?" అతని చెయ్యి వదిలేసి కారు తలుపు హేండిల్ పట్టుకుంటూ అడిగాడు.

లక్ష్మణ్ నవ్వాడు. "నిరభ్యంతరంగా చెప్పవచ్చు."

"ఇన్నాళ్ల నా అనుభవంతో చెప్తున్నాను. ఏందరో అందమైన అమ్మాయిల్ని చూసాను

కానీ సంధ్య అందం ఏవర్లోనూ లేదు పైగా చక్కటి కళాకారిణి. ఆర్టిస్టులంటే నా కెంతో అభిమానం. అలాగే ఆడపిల్లల్ని ఇట్టే ఆక ర్షించేపురుషత్వం మూరీ భవించిన అందమైన విగ్రహం నీది. మీ యిద్దర్నీ ప్రక్క ప్రక్కన చూస్తుంటే ఇందాక ఏమనిపించిందో తెలుసా! మీరు ఒకరికోసం ఒకరు పుట్టలేదు కదా అని పించింది. నై కాంట్ యూ మారీ హర్! నేనే నీ పరిస్థితిలో ఉంటే నిముషం కూడా ఆలస్యం చేయకుండా మూడు ముళ్ళూ వేసేసేవాడిని.''

లక్ష్మణ్ నవ్వి "సంధ్య లాటి అమ్మాయి దొరకకనే నువ్వు బ్రహ్మచారిగా ఉండి పోయావా? ' అడిగాడు.

ఉదయ్ ఒక క్షణం ఆలోచించి "ఒకవిధంగా చెప్పాలంటే అందుకే. జీవితంలో అలాటి అమ్మాయిలు చాలా అరుదుగా తటస్థపడ తారు. కనీసం మనకి తెలిసిన వాళ్ళలో అందం, చదువూ, కళా ఉన్న అమ్మాయిలు ఏ ఒక్కరో తప్ప ఉండరు. సంధ్యని చేసుకోక పోవటం నీ తెలివితక్కువతనమే అవుతుంది'' అన్నాడు.

లక్ష్మణ్ నిర్లిప్తంగా నవ్వి ఊరుకున్నాడు. ఉదయ్ ఎంతసేపూ తన వైపు నుండే ఆలో చిస్తున్నాడు. కాని సంధ్యకి కూడా కొన్ని అభి ప్రాయాలు ఉంటాయని తట్టటమే లేదతనికి.

"బాగా ఆలోచించుకో లక్ష్మణ్! ఈ ఆది వారం మా గీతకి ఆమెని సంధ్యగా కాక సి వుడ్‌గా పరిచయంచెయ్యాలని ఆశిస్తున్నాను'' కారు ఎక్కి కూర్చుని స్టార్ట్ చేస్తూ అన్నాడు ఉదయ్. లక్ష్మణ్ మౌనంగా ఊరుకున్నాడు. కారు కదిలిపోయింది. అతను లోపలికొచ్చేసరికి ఇద్దరికీ కంచాలు పెట్టి అన్నం వడ్డించే ప్రయత్నంలో ఉంది సంధ్య. సరస్వతమ్మగారు ఆ గదిలోనే ఓ ప్రక్కగా చాప వేసుకుని పడుం వాల్చారు.

"బావా! ఇవాళ నీ కిష్టమని నేనే స్వయంగా కూర చేశాను. ఏం కూరో చెప్పుకో'' తలెత్తి అతని వంక చూస్తూ చలాకీగా అంది సంధ్య. లక్ష్మణ్ చేతులు కడుక్కొచ్చి కూర్చుంటూ, "గుత్తి వంకాయ కూరా?!'' నవ్వుతూ అడిగాడు.

సంధ్య అతని ప్రక్కనే కూర్చుంది "కరెక్ట్. తిని ఎలా ఉందో చెప్పు'' అంటూ నాలుగు కాయలు వేసింది.

"చాలు. చాలు. ముందివి తిననీ! నువ్వూ వేసుకో!'' అంటూ వారించి అన్నంతో కలుపుకు తిని, "చాలా బాగా చేశావు సంధ్యా! నువ్వింత బాగా చెయ్యగలవని నాకు తెలీదు సుమా!'' మెచ్చుకోలుగా అన్నాడు నాలుగు నిమిషాల్లో కూరంతా తినేసి.

సంధ్య నవ్వి, "మాటల్లో కాదు చేతల్లో చూపిస్తేనే నమ్ముతాను. ఇవి కూడా వేసుకో ' అంటూ మిగిలిన వంకాయ కూర కూడా అతనిపళ్ళెంలో వంపేసింది.

లక్ష్మణ్ ఖాళీ గిన్నె వంక నొచ్చుకుంటూ చూశాడు. "అదేమిటి సంధ్యా! నీకు మిగుల్చు కోకుండా అంతా నాకే వేసేశావు?''

"ఫరవాలేదు. నువ్వు తింటూంటే నాకూ కడుపు నిండిపోయింది.''

లక్ష్మణ్ తలెత్తి చూసాడు సంధ్య కళ్ళల్లో స్పష్టంగా కనిపిస్తున్న అభి[illegible]నాన్ని ఏ విధంగా తీసుకోవాలో అర్థం కావటేదతనికి. లేక అది అభిమానమని తను పొరపడు తున్నాడా ?! ఏది ఏమైనా సంధ్యకి త్వరగా ఏదైనా మంచి సంబంధం చూసి నిశ్చయం చేసెయ్యాలి. లేకపోతే తనకీ, ఆమెకీ కూడా అటూ ఇటూ ఈ ఊగిసలాట తప్పదు. అనుకున్నాడు.

అన్నట్టుగానే ఆదివారం పదిగంటలకల్లా వచ్చేసాడు ఉదయ్. హాల్లో బట్టలు ఇస్త్రీ చేస్తున్న సంధ్య కెదురుగా కూర్చుంటూ, "హల్లో సంధ్యా! మీరు రెడీ అయిపోయారే! మా వాడేడి ?'' తెల్లటి ఫారిన్ నైలెక్స్ చీరతో రెట్టింపు అందంగా కనిపిస్తున్న ఆమె వంక చూస్తూ అన్నాడు పలకరింపుగా.

సంధ్య తలెత్తి నవ్వి, "ఇదుగో [illegible] బట్టలు ఇస్త్రీ చేయమని నాకు పురమ[illegible] యించి తీరిగ్గా క్రాఫ్ దువ్వుకుంటున్నాడు, అన్నది.

ఇంతలో లక్ష్మణ్ వచ్చి ఉదయ్‌ని పల[illegible] రించి ఇస్త్రీ బట్టలు తీసుకుని లోపలికె[illegible] రెండు నిమిషాల్లో తిరిగి వచ్చి, "వెళ్దామా నేను కూడా రెడీనే'' అన్నాడు.

ముగ్గురూ కారు దగ్గరికొచ్చారు. ఉద[illegible] కారు తాళాలు లక్ష్మణ్ చేతిలో పెట్టి, "[illegible] రోజు నువ్వు డ్రైవ్ చెయ్యి'' అన్నాడ[illegible] "నేనా ?'' లక్ష్మణ్ ఒక్క నిమిషం సం[illegible] యించి, "సరే!'' అన్నాడు. ఉదయ్ చ[illegible] క్కన బాక్‌డోర్ తెరిచి వెనక సీట్లో కూర[illegible] న్నాడు. సంధ్య ఎక్కడ కూర్చోవా[illegible] అన్నట్టు ఆలోచిస్తూ నిల్చుంది. అతని కార[illegible] తామిద్దరూ ఫ్రంట్ సీట్‌లో కూర్చుం[illegible] ఏం బాగుంటుంది! అలా అని చొరవ[illegible] అతనోతోపాటూ వెనక సీట్లో కూర్చోగలదా [illegible]

ఆమె సమస్య గ్రహించినట్టు ఉద[illegible] లేచి కాస్త వంగి ముందు వైపు తలు[illegible] తెరచి, "కూర్చోండి'' అన్నాడు.

"మీరు ముందుకి రండి. నేను వెన[illegible] కూర్చుంటాను.'' అన్నది సంధ్య. ఉద[illegible] నవ్వి, "ఫరవాలేదు ఎక్కండి'' అని మరోసా చెప్పటంతో ఎక్కి కూర్చుంది.

"నీకు డ్రైవింగ్ వచ్చని నాకు తెలీ[illegible] తెలీదు బావా!'' అన్నది తారు రోడ్డు మి[illegible] నుండి సన్నగా సాగిపోతున్న కార్లో నుం[illegible] బయటకు చూస్తూ.



## ఆమెకేం కావాలి ?

"వచ్చా ఏమిటంటీ మీరు నమ్మరు గానీ వీడు ఒక స్టేజిలో ఎంత విరాగి అయిపోయాడంటే మరో రెండు నెలల్లో ఉద్యోగం దొరకకపోతే నా దగ్గర డ్రైవర్‌గా చేరిపోతానన్నాడు. థాంక్ గాడ్! వాడలా అన్న వెంటనే ఉద్యోగం దొరికింది" అన్నాడు వుదయ్ నవ్వుతూ.

లక్ష్మణ్ కూడా నవ్వాడు. "నిజంగా ఆ పనే చేసుండేవాణ్ణి వెంటనే ఉద్యోగం దొరక్కపోతే!" అన్నాడు.

సంధ్య వాళ్ళ మాటలు పరధ్యానంగా వింటోంది. ఓహ్! ఎంత బాగుంది. ఇలా లక్ష్మణ్ ప్రక్కన కూర్చుని కార్లో సాగిపోతూంటే! ఏవో స్వర్గ లోకాల్లో తేలిపోతున్నట్లుంది. అనుకుంది: చాలా సేపటి వరకూ అది తమ స్వంత కారైనట్లూ, లక్ష్మణ్, తనూ పెళ్ళి చేసుకుని అందులో ప్రతి సాయంత్రం షికారు కెళుతున్నట్లూ ఏవేవో ఊహించుకుంటున్న సంధ్య కారు ఆగిపోవడంతో త్రుళ్ళి పడి కళ్ళు తెరిచింది.

ఉదయ్ దిగి లోపలికి దారితీస్తున్నాడు, లక్ష్మణ్ కూడా దిగి, "అయిందా నిద్ర! లేపితేగానీ లేవవేమోనని భయపడ్డాను. రక్షించావు. దిగు" అన్నాడు.

"నేను...నిద్ర పోవటంలేదు" దిగుతూ గొణిగింది సంధ్య.

"మరి?! కళ్ళు మూసుకుని కలలు కంటున్నావా? అవి నీ కలవాటేగా! పద! లోపలికెళ్దాం" అంటూ ముందుకి నడిచాడు లక్ష్మణ్. సంధ్య అతన్ననుసరించింది.

వాళ్లను తీసుకొస్తున్నట్లు ఉదయ్ చెప్పాడులా వుంది గీత నీట్‌గా తయారయి హాల్లో కూర్చుని వాళ్ల కోసమే ఎదురు చూస్తోంది, ఉదయ్ ఆమె వంక తిరిగి, "గీతా చెప్పాను కదూ! ఇతనే నా ఫ్రెండ్ లక్ష్మణ్. ఈమె..." అంటూ ఆగిపోయి లక్ష్మణ్ వంక తిరిగి పరిచయం చెయ్యమన్నట్లు చూసాడు. అతను 'ఈమె నా కాబోయే శ్రీమతి. పేరు సంధ్య' అంటూ పరిచయం చేస్తాడేమో అనుకున్న ఉదయ్ ఊహ నిజం కాలేదు.

"ఈమె నా మరదలు సంధ్య ఈ మధ్యే మా మామయ్యగారుపోయారు. అప్పట్నుండీ నా దగ్గరే ఉంటోంది." మామూలుగానే

చెప్పాడు లక్ష్మణ్. 'ఏమిటి ? నా సలహా పాటించలేదూ?' అన్నట్లు చూస్తున్న ఉదయ్ వంకచూసి సమాధానంగా నవ్వి ఊరుకున్నాడు.

గీత సంతోషంగా సంధ్యని చెయ్యిపట్టుకుని లోపలకి తీసుకెళ్ళిపోయింది. ఉదయ్ లక్ష్మణ్‌ని కూర్చోమని తనూ అతనిప్రక్కనే కూర్చుంటూ, ఏమిటి 'ఇంకా, ఏం నిశ్చయించుకోలేదా నీపెళ్ళిగురించి?' అన్నాడు. 'లేదు. నీ తొందర చూస్తూంటే మాత్రం ఏదోఒకటి నిర్ణయించుకోక తప్పదనిపిస్తోంది. అయినా తమాషాగాలేదూ మొన్న మొన్నటిదాకా నేను నిన్నిలా పోరుతూ ఉండేవాణ్ణి.' అన్నాడు లక్ష్మణ్ నవ్వుతూ. ఉదయ్ భయపడ్డట్లు ముఖంపెట్టి, 'బాబోయ్ ! ఇప్పుడు నీ పెళ్ళిగురించి ఏం మాట్లాడినా నాకే త్రిప్పికొట్టేట్లున్నావు. మరోవిషయం ఏదన్నా మాట్లాడుదాం. అన్నట్లు క్రికెట్ కామెంట్రీ వింటున్నావా?'' అంటూ మాట మార్చేసాడు. దాంతో సంభాషణ క్రికెట్‌మీదికి మళ్ళింది.

చాలా సేపటి తరవాత. 'బావా ! ఇంక వెళ్దామా ?' అంటూ సంధ్య రావటంతో యథాలాపంగా వాచీవంక చూసుకున్న లక్ష్మణ్ త్రుళ్ళిపడ్డట్లు లేచి నిల్చుని,

'బాప్‌రే ! రెండుగంటలు దాటింది. సమయం చాలాత్వరగా గడిచిపోయింది కదూ సంధ్యా!' అన్నాడు.

''ఎండగా ఉంది. సాయంత్రం వెళ్ళకూడదూ !' అన్నది గీత. నిరాడంబరంగా, నిర్మలంగా ఉన్న ఆమెవంక గౌరవంగాచూస్తూ, ''లేదండీ వెళ్ళాలి. మరోసారివస్తాం'' అంటూ సెలవు తీసుకున్నాడు లక్ష్మణ్.

వెళ్ళేదోవలో, 'గీత చాలా మంచిమనిషి. అంత గొప్పింటికోడలైనా ఆ గర్వం, అహంకరం ఆమెలో లేనేలేవు బావా ! ఆమెకు తోచనప్పుడల్లా మనింటికి వస్తుందట. లేకపోతే కారుపంపితే నేను రావాలిట.' అన్నది సంధ్య.

లక్ష్మణ్ సాలోచనగా ఉండిపోయాడు. 'ఒక విధంగాచూస్తే ధనవంతులకే స్నేహంవిలువా, నిజమైన ఆప్యాయతలూ తెలుస్తాయేమో ! మధ్యతరగతి కుటుంబీకులు అందని వాటికోసం అర్రులుజాస్తూ అందుబాటులోఉండే ఆత్మీయతలు గుర్తించలేరేమో !' అనిపించిందతనికి.

సంధ్య కోసం దాదాపు ప్రతి మధ్యాహ్నమూ కారు వచ్చేది. చుట్టు ప్రక్కల వాళ్ళందరూ చూస్తూండగా కార్లో ఎక్కి సాగిపోవటం ఆమెకెంతో ఆనందాన్నిచ్చేది. ఒక్కోసారి సాయంత్రం ఉదయ్ డిస్పెన్సరీకి వెళ్ళేటప్పుడు సంధ్యని ఎక్కించుకుని ఇంటిదగ్గర డ్రాప్‌చేసి తరువాత డిస్పెన్సరీకి వెళ్ళేవాడు. సంధ్యతో పరిచయం అయ్యాక ఉదయ్ తమ ఇంటికి తరచూ రావటం లక్ష్మణ్ గమనించకపోలేదు. సహజంగా కలుపుగోరు మనిషేమో ఆడా, మగా బేధం లేకుండా అందరితోనూ ఫ్రీగా మాట్లాడేవాడు ఉదయ్. సంధ్య మొదట్లో కాస్త మొహమాటపడ్డా ఆ తరువాత అలవాటయిపోయి లక్ష్మణ్‌తో మాటాడినంత చొరవగానూ అతనితో మాట్లాడగలిగే స్థితికి వచ్చింది.

ఆ రోజు ఓవర్ టైమ్ చెయ్యటంవల్ల కాస్త ఆలస్యంగా ఇంటికి వచ్చాడు లక్ష్మణ్. అతను ముఖం కడుక్కుని బట్టలు మార్చుకొచ్చేసరికి సంధ్య కాఫీ తెచ్చిచ్చింది.

''బావా ! ఇందాక ఉదయ్ వచ్చి వెళ్ళాడు. ఏదో పార్టీకి వెళ్తూ మధ్యలో మనతో మాట్లాడిపోదామని దిగాడట. నువ్వెంతసేపటికీ రాకపోయేసరికి వెళ్ళిపోయాడు.'' అన్నది అతను కూర్చున్న మంచానికి మరో ప్రక్క కూర్చుంటూ.

''అలాగా'' లక్ష్మణ్ మామూలుగా అన్నాడు.

సంధ్య ఏదో చెప్పాలనుకుని ఒకక్షణం తటాయించి అంతలోకే ధైర్యం తెచ్చుకుని ''బావా! నేనొక పనిచేసాను. నువ్వు కోపం తెచ్చుకోనంటే చెప్తాను.'' అన్నది.

లక్ష్మణ్ నవ్వి, ''నా కంత త్వరగా కోపం రాదులే! చెప్పు.'' అన్నాడు.

సంధ్య బీర్వా దగ్గరికి వెళ్ళి ఒక పాకెట్ బయటికి తీసింది. లక్ష్మణ్ ప్రశ్నార్థకంగా దానివంక చూసి, ''ఏమిటది ? చీరలు కొనుక్కున్నావా ?'' అడిగాడు.

''చీరలు కాదు...నీకు టెరిలిన్ షర్టూ పాంటూ తెచ్చాను...''

లక్ష్మణ్ అదిరిపడిలేచి నిల్చున్నాడు. తనకంత త్వరగా కోపం రాదని తెలిగ్గా అనేసాడే కానీ అనుకున్నంత తేలిగ్గా కోపాణ్ణాపుకోలేకపోయాడు.

(ఇంకా వుంది)

## స్కోరెంత?-2

బెజవాడలోని ఒక సెంటర్‌లో రెండు మిరపకాయ బజ్జీల కొట్లున్నాయి. రెండూ గ్యాసులైట్‌లతో మెరిసిపోతూ మిర్చి బజ్జీలు అమ్మేవే కాని, ఒక కొట్లో ఎక్కువమంది కస్టమర్‌లు వుంటున్నారు. రెండోవాడు యిది భరించలేక ఒక తన సొంత రిపోర్టర్ సి. ఐ. డి. ఆఫీసర్‌ని పంపాడు. అతను కనుగొన్న రహస్యం యిది : ఆ రెండో కొట్లో, బజ్జీలు పొట్లం కట్టే కాగితాలన్నీ ఒక ప్రముఖ రచయిత్రిగారి సీరియల్ పేజీలే...మర్నాడు రచయిత్రి ఆ సీరియల్‌గల పత్రికల కాపీలన్నీ స్టాల్స్ నుంచే సెరుగా కొని తెప్పించేశాడివతలి కొట్టువాడు...అదీ స్కోరు.

సంచారి



## ఫాలాక్షుని డైరీ

### పుట్టని బిడ్డకి పేరేమిటి ?

పసిఫిక్ మహాసముద్రంలో హోహోట భూభాగం కొంచెంగా కనుపించి, క్రమేపీ అది పెద్దదై హో దీవి మాదిరి ఆకారం తెచ్చుకుంటుందట. సముద్ర మట్టానికి మూడువేలడొందల మీటర్ల ఎత్తు వరకూ ఎదిగిందట భూమి. ఇది పూర్తి స్వరూపాన్ని దాల్చాక ఏ దేశానికి చెందుతుంది అనే విషయం మీద అమెరికా, జపానా నాకంటే నాకనిప్పట్నుంచే పోట్లాట లారంభించేశారట— నాచురల్లీ!

### స్త్రీలు ఉద్యోగాలు చేస్తే..!

పశ్చిమ జర్మనీలో క్రమేపీ జనాభా తగ్గిపోతోందని ఆ ప్రభుత్వం బాధపడుతోందట. 1973లో అక్కడ పది లక్షల పిల్లలు పుట్టారనీ, పోయినేడు కేవలం అయిదు లక్షల పిల్లలే పుట్టారనీ దీనికి స్త్రీలు ఉద్యోగాలు చేయడమే ముఖ్య కారణమనీ ఆ ప్రభుత్వం తెలియచేసింది— అనక.

### అమెరికాలో పార్కుల నిషేధం

అమెరికాలో ఇప్పుడు పార్కులు, పార్కుల వంటివి ఉండరాదని నిర్ణయించి, అవన్నీ ఒక్కొక్కటే తీసేస్తున్నారట. ఈ పార్కులు బాగా చెట్లతో గుబురుగా ఉండడం వల్ల దొంగలకు, రేపిలకు, దోపిడీదారులకు, అక్రమ వ్యవహారాలకూ పుట్టిళ్లుగా ఉంటున్నాయని, ఏ పార్కులో ఏమని షన్నాడో తెలియటం లేదని ఆ ప్రభుత్వం అన్నదట.

### మామని చంపిన అల్లుడు

తమిళనాడు నామక్కల్ తాలూకా వరగూరుకు చెందిన తిరుపతి అనే హో 35 ఏళ్ల కుర్రాడికి, ఆతని అక్క కూతురు తంగాల్ అనే ఆమెకూ వివాహమయినా, ఆతను తన భార్యను ఏలుకోక, వేరే హో అమ్మాయితో అక్రమ సంబంధం పెట్టుకుని ఎంచక్కా ఉంటున్నాడట. ఈ విషయం వరగూరులో పంచాయితీ పెడితే ఆ పంచాయితీలో తిరుపతి తన భార్య పేర హో మూడెకరాల ఎకరం పొలం రాసివ్వాలనీ, అలా కావాలంటే భార్యను ఏలుకోవచ్చనీ, లేపోతే విడాకులివ్వచ్చని తీర్పు చెప్పారట. దాంతో తిరుపతి తన భార్యను ఏలుకుంటానని చెప్పి తీసుకుపోయాడట. ఆ తరువాత ఆతను పంచాయితీ తీర్పు ప్రకారం పొలం రాసివ్వలేదని ఆతని మామ పిరమర్యాగవుండరూ, మరికొందరూ ఆతన్నడిగితే తిరుపతికి కోపం వచ్చి, ఆ పోట్లాటలో కత్తితో మొత్తం ఆరుగుర్ని తక్కొర్ని పొడిస్తే ముగ్గురు చని పోయారట. చనిపోయినవారిలో ఆతని మామగారు కూడా ఉన్నారట.

హైడియర్!

నువ్వు పదోతారీఖున బయలుదేరి వస్తున్నట్లు రాసిన ఉత్తరం అందింది. ఈ మూడు నెలల నుండీ పడుతున్న విరహ వేదనంతా మర్చిపోయాననుకో! ఈ మిగిలిన అయిదురోజులూ ఏ నిద్రలోనో గడిచిపోతే ఎంత బాగుండును? నువ్వు వచ్చాక...అబ్బ! ఏం చెప్పను? ఏమీ తోచడంలేదు ఆనందంతో. ఇంతాఐనాక మళ్ళా మీ శెలవలు కాన్సిల్ చెయ్యరుగదా, అప్పుడెప్పుడో వోసారి చేసినట్లు?..."

అయిదుపేజీల నిండా ఉన్న ఉత్తరం ఏ పదోసారో చదువుకుంటూ రైల్లో నా బెర్తుమీద పడుకున్నాను. తెల్లవారేసరికి మద్రాసులో ఉంటాను. ఈ శెలవులు పదిరోజులూ పదిక్షణాలలా గడపేస్తాం. మళ్ళా తిరిగి బయలుదేరే టప్పుడుంటుంది, అసలు బాధ. అది తల్చుకుంటేనే దిగులైపోతుంది నాకు.

ఏమిటో ఈ ఉద్యోగాలు! ఆయన మద్రాసులోనూ నేను హైదరాబాదులోనూ. పోనీ ఉద్యోగం మానేద్దామంటే మనసొప్పదు. ఏమో! నెలకెనిమిది వందలు వచ్చే ఉద్యోగం చేతులారా మానుకుంటే మళ్ళా విచారించవలసి వస్తుందేమోనని! పోనీ ఆయనన్నా ఖచ్చితంగా ఉద్యోగం మానెయ్యాలని ఎందుకు అడగరు?

మళ్ళా ఉత్తరంలోకి వెళ్ళాను.

"క్రితంసారి వేసవి శలవలకి నువ్వు వచ్చి వెళ్ళాక ఎన్ని రాత్రిళ్ళు నాకు నిద్ర లేదో తెలుసా? ఆ సొదంతా రాసి నిన్ను బాధపెట్టడం ఎందుకని ఉత్తరాల్లో రాయలేదనుకో! ఇప్పుడు మళ్ళీ వస్తున్నావు. నీ తియ్యటి మాటల్తో నన్ను ఆనందంతో ఉక్కిరి బిక్కిరి చేసి పదిరోజులకే మళ్ళీ ప్రయాణం కడతావు. మళ్ళా రెండు నెలలు దాటిన తరవాత గదా నేను శెలవు పెట్టుకుని రావడం! అబ్బ! జీవితంలో ఈ పదిరోజుల కోసం మూడేసి నెలలు నిస్సారంగా గడపాలి గదా! ఎప్పుడూ కలిసి ఉండే భార్యాభర్తలు ఎంత అదృష్టవంతులో గదా..."

నాకు ఇక ఏడుపొక్కటే తరవాయి. ఆయన ఉత్తరాలు ఈ మధ్య మరీ ఏడిపించేస్తున్నాయి నన్ను. ఆ ప్రేమ వరదలో ఎంత మునిగిపోతానో అంత బాధ కూడ కలుగుతుంది అది చదివితే!

మా ఇద్దరికీ సంతోషం కలిగించని ఈ ఉద్యోగంమీద ఒక్కడలని విసుగు కలుగుతుంది. కాని ఒక్కసారిగా 'రిజైన్' చెయ్యాలంటే ధైర్యం చాలదు. ధైర్యంగా నా ఉద్యోగం మానమని మావాళ్ళెవరైనా ప్రోత్సహిస్తారేమోనని ఉంటుంది లోపల. ఐతే ఆ మాట పైకి అనలేను.

అమ్మా, నాన్నా అయితే మా యిద్దరికీ ఏలా కావాలంటే అలా చేయమంటారు.

అన్నయ్యల నడిగితే, "పోనీ కొన్నాళ్ళు చెయ్యమ్మా! కాస్తంత వెనకేసుకుని అప్పుడు మానేస్తే మంచిదేమో! ఉద్యోగం దొరక్క ఎంతమంది అవస్థ పడుతున్నారో చూస్తూనే ఉన్నాంగా!" అంటారు.

ఇంక నా స్నేహితురాళ్ళు 'కొలీగ్స్' అయితే మరీ గడుగ్గాయిలు. ఆడది ఉద్యోగం మానడం కాపురం చెయ్యడం అన్న మాటే గిట్టదు వాళ్ళకి.

"నువ్వు మానేసి మీ ఆయన దగ్గరకి వెళ్ళడం ఎందుకే! ఆయన్నే మానేసి నీతో వచ్చి ఉండమను. ఇద్దరూ సమానంగానే సంపాదిస్తున్నారుగా!" అంటారు. ఇంకా మాట్లాడితే అంతర్జాతీయ మహిళా సంవత్సరాన్ని గురించే, స్త్రీ ఎలా బానిసగా చేయబడిందీ వగైరా మాట్లాడుతారు. అసలీ పెళ్లికాని పార్వతీ, మొగుడొదిలిన జయా వీళ్లైనంతమందిని వేర్పాటు కేసులు చేసె[illegible] మావం.

పిల్లన్నట్టు నిజంగానే ఆయన్ని గనక అడిగితే, ఆయన ఉద్యోగం మానేసి వచ్చేస్తారు కూడా! కాని ఆయన ఉన్నతిని చూసి తరించాలని ఆశపడే నేను ఆ మాట తలవనైనా లేనే! ఇదంతా 'బానిస భావం' అనీ, ఆడది ఈ బుద్ధి మూలంగానే తరతరాలుగా అణగద్రొక్కబడిందనీ, వన్నెన్ని మాటలన్నా మాట్లాడను నేను.

ఆ మధ్య ఓ చిన్న విచిత్రం జరిగింది.



# శ్రీయని ఓటమి

సివియస్ లక్ష్మి

మా హాస్టలు (విద్యార్థినులతో బాటు మేముంటున్న హాస్టలు) వార్షికోత్సవాలకు మమ్మల్నందర్నీ ఏదో ఒక 'ఐటమ్' యివ్వాలని మరీ బలవంతం పెట్టేశారు. అతి కష్టంమీద చిన్న గీతం తయారు చేశాను. అందులో చిన్న భాగం!

మనసుకు నచ్చిన మగని చెలిమిలో
పంచుకున్నదే జీవితం
అనురాగ భరిత హృదయాలే
ఆనంద సాగర తీరాలు
మగ జాతి పైన ద్వేషం
మన మనసు లోని విషం.
కాదంటే నీవు పంకజం
చేస్తాను నీకు వందనం.

ఈ పాట విని అందరూ అభినందించారు. "నీ పాటలో పంకజం ఎవరే?" అని

అందరూ అడగటమే. జయా, పార్వతీ రెండు రోజులు మూతి ముడుచుకుని కూర్చున్నారు నా మీద అలిగి.

ఎప్పుడు నిద్ర పట్టిందో నాకే తెలీదు. మెలకువ వచ్చేసరికి రైలు మద్రాసు సమీపాని కొచ్చేసింది.

ఆయనకోసం ఆతృతగా రైలు కిటికీ ల్లోంచి చూస్తున్నా. అరుగో, మహాను భావులు! మరో శాస్త్రిని ఎవర్నో వెంట తీసు కొచ్చినట్లున్నారు. ఇద్దరూ కలిసి వెతుకు తున్నారు. చిరునవ్వులు చిందించే ఆ మొహం, అయిదడుగుల పదంగుళాల ఆ విగ్రహాన్ని



చూస్తే నా మనసు ఆనందంతో పొంగి పోతుంది. గట్టిగా అరిచి పిలిచాను.

మా పలకరింపు లయ్యాక అతన్ని పరి చయం చేశారు. తమ ఆఫీసుకే కొత్తగా వచ్చాడట. ఇంకా ఇల్లు దొరకలేదట.

అంటే, కొంపతీసి ఈయనతో ఉండ టంలేదు గదా ? అనుకున్నాను. ఖచ్చితంగా అంతే అయింది. రెండు సూట్‌కేసులూ, ఒక బెడ్డింగూ వగైరా సామానులతో ఆ శాస్త్రి ఈ మధ్య మా ఇంట్లోనే కాపురం చేస్తు న్నట్లు ఇంటి కెళుతూనే తెలిసింది. నిజం చెప్పొద్దూ! నాక్కొంచెం ఒళ్ళు మండింది. అసలున్నవే రెండు గదులు. అందులో ఒకటి వంటకీ భోజనాలకి పోతే ఇంకొక్క గది అదే బెడ్‌రూము కమ్ లివింగ్ కమ్ డ్రాయింగ్ రూం వగైరా. ఇలా నేను వచ్చే టైముకి

## తీయని ఓటమి

ఆ స్నేహితుణ్ణి ఇంట్లో పెట్టుకోవడంలో ఏవన్నా తెలివుందా ? అని...

మూడురోజుల పాటు యథావిధిగా ఇద్దరికీ వండి పెట్టాను. ఆ మూడు రోజులూ మా కిద్దరికీ అతిథిదేవుని సేవాభాగ్యం మాత్రం ఘనంగా లభించింది. ఆయన ఒక్కరూ కని పించినప్పుడల్లా కొరకొరా చూసేదాన్ని. ఆయన నావంక జాలిగా చూసేవారు, "నన్నేం చెయ్యమంటావ్?" అన్నట్లు.

ఆ మరునాడు ఆ మహానుభావుడికి ఇల్లు దొరికిందిట. బయలుదేరి వెళ్ళాడు. "అమ్మయ్య" అనిపించింది ప్రాణానికి.

ఆ సాయంత్రం ఆయన కొని ఉంచిన కొత్తచీర కట్టుకుని కూర్చున్నాను. తల నిండా మల్లెపూలు పెట్టుకున్నా. నా పది రోజుల శలవలో అప్పుడే నాలుగు రోజులు గడిచిపోయాయే అని బాధ పడుతున్నా.

"హాయ్! డియర్!" అంటూ అంతలో వచ్చారు శ్రీవారు.

"ఏమిటె, రంభలా తయారయ్యావ్? ఎక్కడికన్నా ప్రోగ్రాం వేశావా?" అన్నారు.

"ఏం మీకు రంభ తెలుసా?" అందామను కున్నాను గాని. చిరుకోపం నటిస్తూ "ఏం మీకేమన్నా వేరే ప్రోగ్రాం గానీ ఉందా?" అడిగాను.

"అబ్బే! రేపు మా పెద్దమ్మా, కొడుకూ వస్తున్నామని టెలిగ్రాం ఇచ్చారు. అతనికేదో పనుంటే ఆవిడకూడా మద్రాసు చూడాలని వస్తోంది. పొద్దున్నే ఎలాగా స్టేషనుకెళ్ళా లనుకో! వాళ్ళకి ఈ శని, ఆదివారాలకి టూరిస్టు బస్సులలో టిక్కెట్లు రిజర్వు చేయించాలి. నువ్వూ వస్తావా?"

నాకు కోపం, ఉక్రోషం, కలిసి ఏడుపులా వచ్చేసింది. "ఇన్నాళ్ళుగా ఇంత ఉద్యోగం చేస్తున్నా మీరు ఒక్క నయాపైసా ఎందుకు వెనకేయలేకపోయారో ఇప్పుడర్థం అవుతోంది. ఇంతమంది బంధుమిత్రగణాలు కలవారు మీకు లోటేమిటి? ఒంటరితనమేమిటి? నా పిచ్చిగానీ..."

నా మాటలు మధ్యలో ఆపేస్తూ,

"ఏమిటీ పిచ్చి పేచి! నేనేం చెయ్యను చెప్పు. మన పెళ్ళయి ఎన్నాళ్ళో కాలేదు గదా! ఇన్నాళ్ళూ ఇంత దూరంలో ఒంటరిగా ఉంటూ మనవాళ్ళు ఎవరొచ్చినా ప్రాణం లేచి వచ్చినట్లుండేది. కాస్త ఆద రించి మర్యాద చేస్తుంటే ఎవరో ఒకరు వస్తుంటారు. హటాత్తుగా, ఇలా ఆవి డొచ్చింది, మీరు రావద్దని చెబితే ఏం బాగుం టుంది, నువ్వే చెప్పు ?"

"ఏమో! ఏం బాగుంటుందో నాకు తెలీదు. అయినా రెండురోజులుకూడా నాతో ఉండటం మీకు వీలుపడదంటే ఇంత శ్రమా, డబ్బూ ఖర్చుపెట్టుకుని నేనెందుకు రావడం ?" అన్నాను. అన్నానే గానీ, అయన

ముఖంలో రంగులు మారడం చూశాక నా తప్పు తెలిసొచ్చింది.

"ఐయామ్ వెరీసారీ డియర్ ! నీకు చాలా శ్రమా, డబ్బు ఖర్చూ కూడ అయినాయ్ నావల్ల. వాళ్ళందరూ ఇలా కట్టకట్టుకుని వస్తున్నారని ఏమాత్రం తెలిసినా నీకు రాసి..."

ఇంతేనా నన్ను ఆయన అర్థం చేసుకొన్నది! ఏదో నా బాధలో నోరు జారి ఒక మాటంటే అదే పట్టుకుని ఎలా దెప్పిపొడుస్తున్నారో! నేనేదో నిజంగా డబ్బుకోసం ఏడుస్తున్నట్టూ, స్వార్థపరురాలిగా భావిస్తున్నారు. ఈ మాటలు వింటుంటే నిజంగానే ఏడుపు వచ్చేసింది.

ఇటువంటి పరిస్థితులలో మాటకి మాట పెరిగితే అది ఎంత దూరం పోతుందో నాకు తెలుసు. ఏదోవివేకం మనసునుహెచ్చరించింది. అందుకే కళ్ళు తుడుచుకుని. ఇకమాటలు పొడిగించకుండా లేచివెళ్ళి కాఫీ తెచ్చి ఇచ్చాను.

"పదండి పోదాం" అన్నాను.

"ఎక్కడికి?"

"మీవాళ్లకు టూరిస్టుబస్సూ, వీళ్లైతే తిరుగు ప్రయాణంటిక్కెట్లూ రిజర్వు

## తీ య ని ఓ ట మి

చెయడానికి" అన్నాను నవ్వుతూ.

"థాంక్స్" అన్నారు.ఎంతో ప్రసన్నంగా మారిపోయిందాయన మూడ్.

* * *

ఆ రాత్రి పడుకో బోయేముందు.అన్నాను,

"ఎంత కాలమండీ ఇలా బాధలు పడడం?"

"ఏం బాధలు బేబీ?"అడిగా రేమీతెలీనట్లు

"అదే,మీరిక్కడా!నేనక్కడా!" ఈ ప్రశ్న ఎప్పుడూ ఆయిన అడిగేదే. ఈసారి నేనడిగాను.

"ఆబాధ నేనెంత పడుతున్నానో నీకెలా చెప్పేది?నాఉత్తరాలు చెప్పడంలేదా అభాధ?" అంతటితో ఆ సంభాషణ ఆగిపోయింది.

పెద్దమ్మగారి ప్రహసనం నాలుగురోజులు గడిచింది. నాకు లోపల ఎంత చిరాకుగా ఉన్నా పైకి మాత్రం ఏమీ కనిపించకుండానే గడిపేశాను. లేకపోతే ఇంక వాళ్ల బంధు వర్గాల్లో నాపేరు ఎంతగా వెళ్ళిపోతుందో అనక ఆయన ఎంత బాధపడతారో తెలుసు.

మేమిద్దరమే ఉన్న సమయాల్లో మటుకు ఏదోరూపంగా ఒకరినొకరు సూటీపోటీ మాటలనుకొనే వాళ్లం.

నాకు తెలీకుండానే నా చిరాకు బయట పడేది.

"ఏమిటో, మళ్ళా ఎవరు దిగుతారో ?" అన్నాను వాళ్ళు వెళ్ళిపోయిన రోజున. ఇంక అప్పటికి రెండు రోజుల తరువాత నా ప్రయాణం.

"అంతా నా తప్పే అయినట్లు నన్నంటావేం బేబీ ?" అన్నారు. "కాకపోతే ! వీళ్లందర్నీ ఇప్పుడు దయచేయమని నేను పిలిచానా ?"

"ఇప్పుడు నువ్వు పిలవలేదు, నేనూ పిలవలేదనుకో! వచ్చేవాళ్ళు మీ వాళ్లయినా, మా వాళ్లయినా ఏదో సర్దుకుపోవాలిగానీ."

ఆయన ఏ ఉద్దేశ్యంతో అన్నారో గానీ, ఆ మాటలతో నా నోరు మూతపడింది. మొన్న వేసవి శలవల్లో నాతో కూడ మా చెల్లీ, తమ్ముడూ వస్తామని సరదా పడుతుంటే వాళ్లని కూడా తీసుకొచ్చాను. రాత్రిళ్ళు పాపం వాళ్ళు వరండాలోనే బొవుం







దని అక్కడే పడుకునేవారు. ఆ పూల తీగ లున్న వరండాలో పడుకోవడం ఆయనకి ఎంత ఇష్టమయినా తప్పక లోపలే పడుకోవలసి వచ్చేది.

అప్పటికి మా పెళ్లయి ఏడాద్దాటింది కాని అయితే మేంకలిసి ఉన్నది మాత్రం సంక్రాంతికి ఒక నెల్నాళ్లు మా ఊళ్లోనూ, ఆయన శలవు పెట్టుకొని వచ్చిన నెల్నాళ్ళూ హైదరాబాదులోనూ. నా వేసవి శలవలకోసం ఆయన ఎంతగా ఎదురు చూశారో నాకే తెలుసు. మేమిద్దరం ఏకాంతంగా ఉండాలని ఆయన ఎంత కోరుకుంటారో తెలిసి కూడా, మా వాళ్లను తీసుకొచ్చినందుకు ఆయన ఏం అనుకుంటారోనని ఓ మూల బెరుగ్గా నేడింది. అయితే వాళ్లు వచ్చినందుకు ఆయన ఎంత సంతోషించారో, వాళ్లను ఎలా ఆదరించారో చూశాక. "ఎంత మంచి వారండీ మీరు?" అంటూ ఎన్నిసార్లు పొగిడానో! వాళ్ళను తన సొంత తమ్ముడూ, చెల్లాయిలాగ చూసిన ఆయన తీరు. తన ఔన్నత్యానికొక గీటురాయి. అటువంటి వారిని ఈ బంధువుల కారణంగా నేను తప్పు పట్టడం నాకే సిగ్గని పించింది.

అయితే ఇది ఎప్పుడూ ఉండే సమస్యే. ఇది తీరేదెట్లా ? గంటలు గడుస్తున్న కొద్దీ నాలో బెంగ అధికం కాసాగింది. ఈ సారి ఆయన నొదిలి వెళ్లలేననిపిస్తోంది . ఈ ప్రేమైక మూర్తిసాన్నిధ్యాన్నొదిలి అక్కడ ఏడారి లాంటి జీవితం గడపాలంటే ఒకటే బాధ కలుగుతోంది.

ప్రపంచంలో ఉద్యోగాల కోసం విడిగా ఉండే భార్యాభర్త లందరూ ఇలాగే బాధలు పడతారా? మనసు గట్టి చేసుకుని కొన్నాళ్ళిలా అలవాటు చేసుకుంటే నాకూ అలవాటవు తుందేమో ! కాని, జీవితమంతా నింపుకోగల ఈ మధుర క్షణాల నుండి విలువైన ఎన్నో సంవత్సరాల జీవితాన్ని వ్యర్థం చేసుకొంటు న్నానేమో !

కొన్నాళ్లు దూరంగా ఉండడంతో భార్యా భర్తల మధ్య ప్రేమ ఇనుమడిస్తుందనీ, ఎప్పుడూ కలిసే ఉండేవాళ్ళ మధ్య అలవాటు వల్ల పొరపొచ్చాలు రావడం సహజమనీ కొన్ని 'థియరీ'లు నాలో ఉండేవి. ఆ భావాలన్నీ శుద్ధ అబద్ధాలులా అనిపించాయా క్షణంలో.

ఈ ఆలోచనలతో నిద్రే రావటం లేదా రోజు. అర్ధరాత్రి ఆయన్ను తట్టి లేపాను.

"ఏమిటి ?" అంటూ నా చుట్టూ చేతులు వేసి దగ్గరకు తీసుకుంటూ అడిగారు.

"ఏవండీ! రేపు నేను వెళ్లిపోవాలి" అంటూ కళ్లనీళ్లు పెట్టుకున్నాను.

"ఛ! ఏమిటీ బేలతనం! మరి ఆశయంతో ఉద్యోగం చేస్తున్నదానివి కదా, ఇలా బాధ పడితే ఎలా! పాపం నిన్ను మాటి మాటికి రమ్మని నేనే బాధ పెడుతున్నానేమో!"

ఆయన మాటలకి నవ్వాలో ఏడవాలో అర్థం కాలేదు. ఏమిటీ! నే నేదో ఆశయం కోసం ఉద్యోగం చేస్తున్నానా! ఏమిటబ్బా అది! తనే నన్ను రప్పించి బాధ పెడుతు న్నారా! అనాలనే అంటున్నారా ఈ మర్యాద మాటలు!

ఓరగా చూస్తూ, "అయితే నేను రాక పోయినా మీకు ఫరవాలేదు?" అడిగాను.

"అది నా హృదయాన్నడుగు" అంటూ నా తల తన గుండెల మీదికి లాక్కున్నారు.

నేను గోముగా, "ఎందుకండీ నాకీ ఉద్యోగం! నేను మానేస్తానండీ" అన్నాను.

"పొరపాటున నువ్విన్నాళ్ళూ నాకోసం ఉద్యోగం చేస్తున్నానని మాత్రం అనుకోవడం లేదు గదా! ఏదేమైనా ఈవేళ నీ నోటినుండి ఎంత తియ్యటి మాట విన్నాను! ఇది, నిజ మేనా! దీనికి తగిన తీపి నీకేం ఇవ్వగలను?"

ఆ పైన నిముషంపాటు మాటలు లేవు.

ఆయనను విడిపించుకుని అడిగాను, "మీ రిన్నాళ్ళూ నన్ను ఎందుకీ ఉద్యోగం చెయ్యానిచ్చారు? మాన్పించలేక పోయారా?"

"నీలో ఇంత అద్భుతమైన, నాకు కావల సిన బేలతనం ఉందని తెలిక" అన్నారు. నా కర్థం కాలేదు ఆయనే మళ్ళా,

"పిచ్చి బేబీ! మొదట్లోనే, నిన్ను ఉద్యోగం మానేసి రమ్మంటే వచ్చేదానవో లేదో నాకుతెలీదు. వస్తావనే నమ్మకం ఉంది కానీ, తీరా అందుకు వ్యతిరేకంగా జరిగితే నా

త్వరలో

## 'మంగదిక్కు'

సీరియల్

అభిమానం బాగా దెబ్బ తింటుంది. అదీగాక నువ్వు ఏదన్నా ఆశయం కోసం అంటే ఉదాహరణకి, మీ నాన్నగారికో, తమ్ముళ్ళకో సహాయం చెయ్యడం కోసం ఉద్యోగం చేస్తున్నావనుకో, అటువంటి పరిస్థితిలో ఏం చెయ్యడానికి నీకూ ఇబ్బందిగానే ఉంటుంది. తీరా మానేసినా, తరవాత ఎప్పుడైనా నా కోసం నీ ఉద్యోగం త్యాగం చేశానన్న భావమే ఉంటుంది నీలో..."

"అబ్బ! ఎన్ని ఆలోచించారండీ?" అన్నాను వేళాకోళంగా.

"కాదంటావా! నా ఊహలు నిజమయ్యే అవకాశం లేదంటావా?"

"ఎలా అంటాను? నా పతిదేవుడి తెలివికి పొంగిపోతాను కానీ! అయితే మరి ఏం చేద్దామనుకున్నారు? ఇలా బాధలు పడటానికే నిశ్చయించుకున్నారా?"

ఆయన నా ముంగురులు సవరిస్తూ,

"అందుకే చిన్న నాటకం ఆడాను. నిన్ను ఈసారి రమ్మని మరీ పిచ్చెక్కించేటట్లు ఉత్తరాలు రాసి, నువ్వు వచ్చేటప్పటికి ఈ బంధు, మిత్ర వర్గాలను ఏర్పాటు చేశాను. నేననుకున్నట్లు నీలో బాధ కలిగాక, నీద్వారానే నీ ఉద్యోగానికి ఉద్వాసన ఇప్పించాలని ఉద్దేశం. ఈ ప్రవర్తన నీకు కోపం, అసహ్యం కలిగిస్తుందేమోననే భయం ఉన్నా, ఈ అవకాశం కూడా ఉందని నా నమ్మకం. దేవిగారు నేననుకొన్నట్లుగానే రియాక్టయి ఈ వరం ప్రసాదించారు. ఈ దీనుడిమీద కోపం మాత్రం వద్దు దేవీ!"

ఎంత తీయని ఓటమి! "ఈ సంతోషమే ఓటమియైతే, ఓ ప్రభూ! ఎప్పుడూ ఈ దేవుడిముందు నా కిటువంటి ఓటమినే ప్రసాదించు" అని దేవదేవుణ్ణి ప్రార్థించాను.

ఆయన కళ్ళల్లో వెలిగే సంతృప్తి చూసి నా మనసు పొంగిపోయింది.

"నా ఉద్యోగానికి గుడ్‌బై! ఓ రిజిగ్నేషన్ లెటర్ రాసిపెట్టండి గురూ!" అన్నాను.

"అంత తొందరపడకు గురూ! బాగా ఆలోచించు..."

"మళ్ళా నాలో పిరికిమందు పోస్తున్నారు. నో సెకండ్ థాట్స్" అన్నాను.

"అసలిప్పుడు థాట్స్ వద్దు కావలసినదిదే ము ... ..."

సీరియల్

# డాక్టర్ వనిత

గంటి వెంకటరమణ

*(గత సంచిక తరువాయి)*

నాలుగైదు రోజులు గడిచిపోయాయి. గాంధీ రావుగారి దగ్గరకి వచ్చి నిలుచున్నాడు. వంట పనిలో యింటి పనిలో గాంధీ అన్నీ తనే అయి ఆయనకి సహాయం చేస్తున్నాడు. వనిత లేచి తిరిగినా వంట యింట్లోకి రావడంలేదు.

ఇన్నేళ్ళు గడిచినా రావుగారికి వంటమనిషి అవసరం రాలేదు. చాలాసార్లు ఆయన ఆ మాట కూతురుతో అంటే 'లేదు నాన్నా యిప్పటికైనా మీకు వండిపెట్టే అవకాశం కలిగింది. నేనున్నాను కదా' అనేది.

తండ్రీ కూతుళ్ళు కలిసి భోజనం చేయడంలో రావుగారు గతించిన బాధలన్నీ తుడుచుకుని పోయి నట్లయేవి. డబ్బు దాచి ఏదో చేయాలన్న కోరిక ఏమీలేదు ఆయనకి. కానీ... వనిత ఆయన్ని వంట మనిషి కోసం ఖర్చు పెట్టనీయలేదు.

'నేనింక వెళ్ళొస్తానండీ' అన్నాడు గాంధీ చేతిలో వున్న తువ్వాలుతో తడి తుడుచుకుంటూ.

రావుగారు గంభీరంగా మారిపోయారు. ఆయన అక్కడే వున్న కుర్చీలో కూర్చుని 'మీరలా కూర్చోండి' అన్నాడు.

గాంధీ అతని కెదురుగా కూర్చున్నాడు.

కాసేపు ఏమి మాట్లాడాలో అర్థం కానట్లు తటపటాయించి చివరికి పెదవి విప్పారు.

'నేను పొరబాటు చేశాను. నా భార్యను వదిలేసి లండన్‌లో వేరే పెళ్ళి చేసుకున్నాను. రోజులు దొర్లిపోయాయి. అప్పట్లో కులాసాగా స్వర్గసీమ అంటే వేరే లేదన్నట్లు జీవితం గడిపే శాము. వయసు ముదిరి అందం కరిగిపోయేసరికి కల చెదిరి వాస్తవం బయటపడింది. ఆమె వెళ్ళి పోయింది. నా అనేవాళ్ళు లేక అలమటించిపోయాను. ఆమె దగ్గరకి ఎలా వెళ్ళను? ఎంత డాక్టర్నైనా ఆమె మొహం చూసేందుకు ఎంత ధైర్యం వుండాలి?'

'చాలా సంపాదించాను. నా తదనంతరం ఎవరూ లేరే అన్న బెంగలో వుండగా తల్లి మాదిరి గానే భంగపడి వనిత — నా బిడ్డ — తనను తాను పరిచయం చేసుకుంటూ నా యింటికి వచ్చింది. చాలా కాలంనాటి సంగతి యిది.'

'తప్పు ఒప్పులు ఎవరు చేసినా ఒకటే నా దృష్టిలో. స్త్రీ పురుష భేదం లేదు పాప నిర్ణయంలో. పురుషుడు చేసిన తప్పుకు స్త్రీ శిక్ష పొందడం అన్యాయంకాదా. భర్త చనిపోతే ఆమె అందాన్ని చెరిపేసి సంఘంలో ఆమెకి విలువలేకుండా చేసే పెద్దమనుషులు భార్య చనిపోతే మూడు రోజులకే వాడిని పెళ్ళికొడుకును చేస్తారు. ఇది యీనాటి నా ఒక్కడి ఘోష కాదు శతాబ్దాలుగా వింటూనేవున్న యీ కథ పునశ్చరణం అవుతోంది ఎప్పటికప్పుడు.'

'వనిత నాకు వృద్ధాప్యంలో లభించిన స్నేహితురాలు. నేను రాలిపోయేవరకూ ఆమె నావెంట వుంటోంది. నా తరువాత ఆమె ఏమైపోతుంది?'

'గాంధీ...' ఆయన పిలుపులో యెంతో ఆప్యాయత కనిపిస్తోంది.

గాంధీ కుతూహలంగా ఆయనవైపు చూశాడు.

'నువ్వు యింతవరకూ పెళ్ళి చేసుకోలేదేం?'

'అవును పెళ్ళి చేసుకోలేదండి నేను.' గాంధీ కళ్ళముందు గతం మరోసారి కదిలింది. 'మీరు స్నేహితుడి మాదిరి అడిగారు కనుక చెబుతున్నాను. నేనెప్పుడూ కులాసాగా జీవితాన్ని సంతోషంగా వుంచుకోవాలన్న ధ్యాసతో పెరిగాను. అలాగే నడుచుకున్నాను.'

'చాలా ఏళ్ళ క్రితం నేను రైల్లో ఒకమ్మాయిని

కాకూడదని అనుకున్నాను ఆ తరువాత. నేను మధ్యలో దిగిపోవలసివచ్చింది. వనిత నాతో ప్రయాణం చేసింది డాక్టర్‌గారూ! ఆమెను పెళ్ళి చేసుకోవాలనే వుద్దేశ్యంతో నేను ఢిల్లీ హాస్పటల్‌కి వుత్తరం వ్రాస్తే అప్పటికే ఆమెకి పెళ్ళి అయిపోయిందనీ అమెరికా వెళ్ళిందనీ రిజైన్ చేసిందనీ నాకు వుత్తరం వ్రాశారు. ఆ తరువాత హరిజనుల పిల్లను పెళ్ళి చేసుకోవాలనుకున్నాను. కానీ...ఆమె తరఫువాళ్ళు మా పెళ్ళికి ఇష్టపడలేదు.'

'రెండుసార్లు చెడిపోయాక పెళ్ళి అంటే విసుగనిపించి ఆ ప్రసక్తే మానేశాను.'

"ఇప్పుడు యిష్టపడే మనుష్యులుంటే...నువ్వు కాదంటావా..."

'భలేవారే!' నవ్వాడు గాంధీ 'నావయసు నలభై దాటింది. ఏ పసిపిల్లనో చేసుకోవడం యిష్టంలేదు నాకు.. పోతే యిప్పుడు" గాంధీ తల దించుకున్నాడు.

'వనితకి స్నేహితుడు కావాలి గాంధీ! మీరు యిష్టపడితే ఆమె జీవితానికి దారి చూపించినవారు అవుతారుకదా!'

గాంధీ చటుక్కున తలెత్తాడు. అతనికి తెలుసు రావుగారి ఆంతర్యం. తనకూ పెద్ద అయిష్టమేమీ లేదు. కానీ యింత త్వరగా యెదుర్కొంటాడని మాత్రం అనుకోలేదు. 'మీ యిష్టం.' అన్నాడు.

రావుగారు వనిత గదివైపు వెళ్ళారు.

*　　*　　*

'నెహ్రూ ... నెహ్రూ ... నెహ్రూ!' వనిత అంతరంగం వేధిస్తోంది. నెహ్రూ గాంధీని చులకన చేస్తాడేమోనన్న భీతి ఆమెను వేధిస్తోంది.

పక్క గదిలో కూర్చుని గాంధీ మాట్లాడు తున్నాడు. నెహ్రూ శ్రద్ధగా వింటున్నాడు.

'చెప్పండి.'

'తల్లిని ఆ పిల్లవాడు ఏమీ అనలేదు. తండ్రి మీద ద్వేషంతో తమ్ముడిని తీసుకుని పరుగు లేస్తాడు — అందరికీ దూరంగా వెళ్ళిపోవాలని.'

***జరిగిన కథ-10:*** **తల్లి** యామినిని చూడ్డానికి ఢిల్లీ నుంచి హైదరాబాద్ వచ్చిన డాక్టర్ వనితకి రైల్లో తారసపడ్డ ఎమ్. కె. గాంధీ తన అందంతో ఆమె హృదయంలో తిష్టవేస్తాడు. తనను ఎంతో ప్రేమగా చూచే మేనమావ భార్య శ్రీదేవి భర్తృ పరిత్యక్త అయిన తన తల్లిపట్ల నిర్దాక్షిణ్యంగా వుండటం బాధిస్తుంది వనితని. శ్రీదేవి నరహరిల రెండో కొడుకు గోకుల్ ఇంజనీర్. తనను పెళ్ళాడమని గోకుల్ అనటంతో గాంధీ గుర్తుకొచ్చి ఎటూ నిర్ణయించుకోలేక పోతుంది వనిత. గతంలో... **యామిని** కిష్టం లేకపోయినా భగవన్నారాయణరావుతో వివాహం జరిపిస్తాడు తండ్రి వేణుగోపాల్. పాశ్చాత్య నాగరికతపై మోజున్న భర్త కోపతాపాలకి హడలిపోతుంది **యామిని**. తన మాటే నెగ్గాలనే రావ్ మనస్తత్వానికి ఎదురు తిరగాలనుకుంటుంది యామిని. చదువుకోకపోవటం అనర్హతగా యామినిని వదిలి లండన్ వెళ్ళిన రావ్ అక్కడ మరో పెళ్ళి చేసుకుంటాడు. గోకుల్‌తో పెళ్ళయిన వెంటనే అమెరికా బయల్దేరిన వనిత తండ్రిని కలుసుకోవాలనుకుంటుంది. గాంధీ తండ్రి పట్నాయక్‌గారు రాజకీయవాది. గాంధీతోపాటే పట్నాయక్ ఆదరణలో పెరిగిన హరిజన యువతి కాదంబరికి గాంధీని వివాహమాడాలనుంటుంది. వనితకి వివాహ మయిందని తెలిసిన గాంధీ వ్యాకులత చెందుతాడు. గోకుల్ కోరుకునే సంఘ జీవనానికి అలవాటు పడలేకపోతుంది వనిత. తన ఎదుటే గోకుల్ పరాయి స్త్రీని చేరదీయటంతో మనసు విరిగిపోయి గోకుల్‌ని వదిలి హైదరాబాద్ వచ్చేసిన వనిత కొడుకు నెహ్రూతో తండ్రి దగ్గర స్థిరపడుతుంది. కాలచక్రంలో పదేళ్ళు తిరిగిపోయిన తర్వాత ఓరోజు నెహ్రూ తమ స్కూలుకి మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ వచ్చారనటంతో వనిత హృదయంలో అలజడి ప్రారంభమౌతుంది. గాంధీని కలుసుకుని తనతోబాటు ఇంటికి తీసుకువస్తుంది వనిత. వనితతోను, కాదంబరితోను తన పెళ్ళి తప్పిపోవడంతో బ్రహ్మచారిగా వుండిపోతాడు గాంధీ.

'నేను మార్నింగ్ షో చూశానండీ తాతగారితో. తాతగారికి అశోక్‌కుమార్ అంటే యిష్టంట, ఆయన కానూన్, మమతా కూడా చూపించారు.'

'ఓహ్!... అబ్బా యిప్పుడు చెప్పు నెహ్రూ ఆ పిల్లవాడి తల్లిలాగే మీ అమ్మ కూడా పెళ్లి చేసుకుంటే...'

పన్నెండేళ్ళ నెహ్రూ అతనివైపు విచిత్రంగా చూశాడు. అర్థం కానట్లు మొహం చిట్లించాడు.

'అరె... నువ్వంతలోనే యిరిటేట్ అవుతున్నావు.'

'లేదండి... అంటే మా నాన్న... నాకు నాన్న లేరన్నమాట. యిన్నాళ్ళూ మా నాన్న అమెరికాలో వున్నారని అంటే...'

నెహ్రూ మొహం చిన్నబోయింది. గాంధీ అతన్ని వొడిలోకి తీసుకుని 'నెహ్రూ... నేనే మీ అమ్మని మోసం చేసిన నాన్నని' అన్నాడు.

'డాడీ మీరా...' నెహ్రూ అతని వొడిలోకి వాలిపోయాడు.

కిటికీ కర్టెన్ తొలిగించి వనిత చూస్తోంది. అతని వొడిలో ఏ ప్రశ్నా వేయకుండా పడుకుని వున్నాడు నెహ్రూ. అతని గుబురు క్రాపులో వేళ్ళు పోనిచ్చి జాలిగా చూస్తున్నాడు గాంధీ.

వారంరోజుల క్రితం యాదగిరి నరసింహస్వామి సన్నిధిలో అతి నిరాడంబరంగా పెళ్లి చేసుకున్నాడు గాంధీ. ఆ సమయంలో నెహ్రూని స్నేహితుడి యింటికి పంపాడు రావుగారు.

ఇంటికి నెహ్రూ యీ మధ్యాహ్నమే వచ్చాడు. వనిత అతనికి కనిపించినా యెక్కువసేపు నిలువలేక పోయింది. కొత్తగా మెళ్లో నల్లపూసలు, మంగళసూత్రం, కాలికి మట్టెలు ... ఆమె వారం రోజుల్నుంచి వీటిని అంత పట్టించుకోలేదు. నెహ్రూ వస్తూనే 'మమ్మీ!' అని కేకపెట్టి లోపలికి వచ్చాడు.

ఆమె ఆ కేక విని పరుగులాంటి నడకతో వచ్చి కొడుకుని కౌగలించుకుంది. నెహ్రూ నాగార్జునసాగర్ డామ్ గురించీ, ఎత్తిపోతల వాటర్ ఫాల్స్ గురించీ, శిథిలమైన విశ్వవిద్యాలయం తాలూకు వింతలు గురించీ ఓ ... ధారాళంగా ఉపన్యాసం యిస్తున్నాడు. ఆమె శ్రద్ధగా వినలేక పోతోంది.

చెబుతూ...చెబుతూ చటుక్కున ఆగిపోయాడు నెహ్రూ. ఆమెవైపు నఖశిఖపర్యంతం దృష్టిని సారించి ఒక్కసారి చూసి ఏమనుకున్నాడో రావుగారి గదిలోకి వెళ్లిపోయాడు.

ఆ తరువాత గాంధీ రాగానే వనిత తన భయాన్ని అతనికి చెప్పింది.

అతను నరాసరి మామగారి గది దగ్గరకి వెళ్లి నెహ్రూని పిలుచుకుని వచ్చాడు. అతను తనకు తెలిసిన రీతిలో నెహ్రూ చిన్నమనసుకి అర్థమయేలా 'ఏక్‌హిరస్తా' చెబుతూంటే నెహ్రూ కథ మాదిరే విన్నాడు. వనిత గురించి ప్రసక్తి రాగానే దెబ్బతిన్న లేడిపిల్లలా ముడుచుకుపోయాడు.

ఎన్నేళ్ళుగా తండ్రి కోసం నిరీక్షిస్తున్నాడో నెహ్రూ గాంధీ వొడిలో వాలిపోయి అతన్ని ఆబగా, అత్యంత ఆశగా జారిపోతాడేమోనన్న అనుమానంతో పట్టుకోవడంలోనే తెలుస్తోంది. నెహ్రూ తండ్రి తొడమీద తల వుంచుకుని వెల్లకిలా తిరిగి రెండు చేతులూ పైకెత్తి అతని మెడచుట్టూ ముడి వేశాడు.

గాంధీ చిరునవ్వు నవ్వి 'లే! మనం బయటికి వెడదాం...' అన్నాడు.

నెహ్రూ పట్టు వదిలి ఛెంగుమని క్రిందికి దూకాడు. అతను పరిగెత్తుతూంటే వనిత ఎదురైంది. ఆమెవైపు చూసి... తిరిగి తన గది వైపు నడక సాగించాడు. వనితకి ఆశ్చర్యం, దుఃఖం, బాధ, ఒకదానివెంట మరొకటి వుప్పెనలా రాసాగాయి.

నెహ్రూ వెళ్లిపోయినవైపే చూస్తూ శిలా ప్రతిమలా నిలుచుండిపోయింది. గది దాటి బయటికి వచ్చాడు గాంధీ. అక్కడ బొమ్మలా నిలుచున్న వనితనీ దూరంగా పరుగెత్తుతున్న నెహ్రూని మార్చి మార్చి చూశాడు. నెహ్రూని ఎదుర్కోవడం అతనికి భయంగానే వుంది.





పాయంత్రం అయింది. నెహ్రూని తీసుకుని
ా దూరమే వెళ్ళాడు.

నెహ్రూ హుసేన్‌సాగర్ వంతెనమీద దృఢ
_న పూసల్ని పట్టుకుని నీళ్ళవైపు చూస్తూ
ాశంవైపు చూస్తూ ఏమని మాట్లాడాలో
యనివాడిలా నిలబడిపోయాడు. గాంధీ అతనికి
ప్ది దూరంలో నిలుచుని 'చూశావా దూరంగా
క్కడ పొగ వస్తోంది చూడు... అదేమిటో
ెసా ?' అని అడిగాడు. అతనికీ తోచడంలేదు.

నెహ్రూ నవ్వి అన్నాడు : 'అదుగో హుసేన్
ర్‌కి అవతలివైపు ఖైరతాబాద్, హుసేన్‌సాగర్
క్షన్... అక్కడ పొగ వచ్చేది మింట్ కాంపౌండ్.
ిడండి నౌబత్ పహాడ్ అది... ఆ క్రిందే
గయూష్... రేడియో స్టేషన్ వున్నాయి.'

యింకేం మాట్లాడగలడు గాంధీ. 'మనం
స్కలోకి వెడదామా ?'

'వొద్దులెండి ఈ బెంచీలమీద కూర్చుందాం.'

'నీకు కోపంగా వుంది కదూ.'

'నా కెందుకండీ కోపం...' నెహ్రూ కళ్ళల్లో
ప్నట్టుండి నీళ్ళు తళ తళ లాడాయి.

'నువ్వు ఏడుస్తున్నావా ?' గాంధీ ఖంగారుగా
ిగాడు.

నెహ్రూ కళ్ళు తుడుచుకున్నాడు. కన్నీటి
రలు బుగ్గలమీద ఏర్పడ్డాయి.

'ఎందుకు నెహ్రూ, ఎందుకేడుస్తున్నావు ?
జ్ నాతో చెప్పవూ... నేను...'

'మీరు డాడీని అంటారు... హుం ఎందుకు
ిడీ ?' నెహ్రూ అటు తిరిగి మోకాళ్ళమీద
ఖ లాన్చుకుని కూర్చున్నాడు. డబుల్ డెక్
స్తోంది. మరొకటి సికింద్రాబాద్ వైపు

వెడుతోంది. బేగంపేటలో లైట్ ఫోకస్ కనిపిస్తోంది.
ఎయిర్‌క్రాఫ్ట్ లాండింగ్ టేకాఫ్ ... మరేదో ...
బర్ ... ర్...ర్ ... ఆకాశం చిల్లుపడుతున్న శబ్దం
చేస్తూ రెక్కలు చాపుకుని నెత్తిమీంచి
వెళ్ళిపోతున్నట్లు పరుగులు పెడుతోంది విమానం.
ఆ శబ్దానికి అదిరిపడ్డాడు నెహ్రూ. గాంధీ అతని
వీపుమీద చేయి వేశాడు.

'సార్ !'

'నెహ్రూ...' నిర్ఘాంతపోయాడు గాంధీ.

'చెప్పండి సర్ ! కెన్ యూ హెల్ప్‌మీ...'
నెహ్రూ కళ్ళు దీనాతిదీనంగా అర్థిస్తున్నాయి.

గాంధీ తనను తాను సమాధానపరుచుకున్నాడు.
నెహ్రూని దగ్గరికి తీసుకున్నాడు. అతని శిరస్సుమీద
చేయి వేసి 'చెప్పు నెహ్రూ ! నీకోసం ఏది
చేయమన్నా చేస్తాను.' అన్నాడు.

నెహ్రూ గంభీరంగా మారిపోయాడు.
'వినండి. నేను యింటికి వచ్చేముందు మా ఫ్రెండ్
యింటికి వెళ్ళాను.'

'మా ఫ్రెండ్ తల్లి నన్ను చూస్తూనే
చేతులుచాపి ఆహ్వానించేది. నేను నాగార్జునసాగర్
నుంచి రావడమే వాడికోసం వచ్చాను. మేమిద్దరం
పోటీలుపడి చదివేవాళ్ళం.'

'నన్ను గురించి నేను గప్పాల్ కొట్టకూడదు
కానండి మెరిట్ స్కాలర్‌షిప్ప్ అన్నీ నావే. నన్నావిడ
ఎంత ప్రేమగా చూసేదంటే హాస్పటల్ రోగులా
అంటూ వూపిరిఆడని మా అమ్మకూడా అంత
బాగా చూడలేకపోయేది. నేను వాడిని పేరుపెట్టి
పిలుస్తూండగానే ఆవిడ ముందు వచ్చేది.'

'అటువంటిది...' కాసేపు ఆగాడు నెహ్రూ.
అతని పిడికిళ్ళు మూసుకుంటున్నాయి. మొహం
ఎర్రబడింది. పళ్ళు పటపట లాడుతున్నాయి.
శరీరం ప్రతి అణువు ప్రతీకారంతో భగభగలాడు
తున్నట్లు అతని గుండె వేగం గాంధీ చేతులకు
తెలుపుతోంది. గాంధీ మనసంతా అతలాకుతలమై
పోసాగింది.

'అటువంటిది ... డామ్ యిన్సల్ట్. ఎంత
మాట అన్నది ! మా చిరంజీవి యింక రాడు.
నువ్వు రాకు యిటువైపు. వాళ్ళ నాన్నగారికి
తెలుస్తే యిప్పటికే యిలా రానిచ్చినందుకు
కోపగిస్తారు.'

'ఆ మాట వింటూనే నేనెలా మారిపోయానో
తెలుసాండీ ... అక్కడ గేటు లేకపోతే కుప్పలా
కూలిపోయేవాడిని. అక్కడే చచ్చిపోవాలనిపించింది.
వాళ్ళూ మాలాగే ధనవంతులు. నాకు లేనిదేమీ
వాళ్ళింట్లో లేదు. నేను ఆ యింట్లో ఎన్నోసార్లు
ఒంటరిగా చిరంజీవితో కాలక్షేపం చేశాను. ఒకవేళ
నామీద ఆమెకు దొంగతనం చేసిన అనుమానంవంటి
దేమీ రాలేదుకదా ... అనుకున్నాను. నా శక్తినంతా
వుపయోగించి 'నేనేం చేశాను పెద్దమ్మా !' అని
అడిగాను.

ఆవిడ ఖచ్చితంగా అంది : 'ఒద్దు నన్నావిధంగా
పిలవకు. మీ అమ్మ యిప్పుడు ఎవర్నో పెళ్ళి
చేసుకుందిటకదా ... అటువంటి యిళ్ళకు మా
యింట్లో వెళ్ళనివ్వరు ... రానివ్వరు.'

'అంతే నేను పరుగెత్తి వచ్చాను. వచ్చిన
చాలాసేపటికి మిమ్మల్ని కలుసుకున్నాను. తాతగారు
నాతో ఎంతసేపు మాట్లాడినా మీ విషయమే చెప్ప
లేదు.'

'చివరికి మీ దగ్గరకి వచ్చాను. మీరు మంచివారే
కాదనను... కానీ సర్... నేను ఎక్‌హీరస్తా...
సినిమాలో పిల్లాడిని కాను. నాకు మా నాన్నే కావాలి.
మీరు నన్ను ఆయన దగ్గరకి పంపలేరా సర్...'
నెహ్రూ చెప్పడం ఆపాడు.

గాంధీ అతనివైపు చూసి 'అలాగే...
తప్పకుండా పంపిస్తాను. కానీ...' అని ఆపాడు.

'కానీ...'

'నువ్వు ఎలాగైనా చివరికి నా దగ్గరకే
వచ్చేయాలి. నిన్ను అతని దగ్గర వుండనీయను.
మీ అమ్మ నీ కోసం బ్రతుకుతోంది. నేను నీతో...
చిన్నపిల్లడివి నువ్వు, యిలా చెప్పకూడదు కానీ
తప్పదు. మీ అమ్మకి నువ్వెంతో నాకు అంతకంటే
ఎక్కువే.'

చిత్రంగా చూశాడు నెహ్రూ.

'వనితని నేను యిష్టపడి పెళ్ళి చేసుకున్నాను.
ఆమెకు ప్రియమైనది నాకు ప్రియాతి ప్రియ
మైనదీ ప్రాణాధికం అయినదీ... నాకా మాట
యిస్తే నిన్ను పంపే ఏర్పాట్లు చేస్తాను.'

'మా నాన్న ముందు నేను యివన్నీ మరిచిపో
గలను సర్. నాకీ మరుపు కావాలి. నాకు మీరెవరన్నా
ప్రస్తుతం చిరాకుగా వుంది. ప్లీజ్ నన్ను మా నాన్న
దగ్గరికి పంపలేరా సర్...'

గాంధీ మరోసారి అన్నాడు : 'పంపుతాను.
నెహ్రూ నిన్ను నా మనస్ఫూర్తిగా ప్రేమిస్తాను

"ఆంధ్రా ఎసోసియేషన్ జయపూర్" వారు శ్రీ మాధవీ పద్మాలయా కంబైన్స్ వారు తీస్తున్న "కురుక్షేత్రం" సినిమా ఔట్‌డోర్ షూటింగుకు జయపూర్ వచ్చిన సినీనటులకు అక్టోబరు 30వ తేదీన సన్మానం చేసారు. చిత్రంలో ప్రముఖ సినీ నటులు సత్యనారాయణ, కృష్ణంరాజు, చంద్రమోహన్, శోభన్‌బాబు, కాంతారావు, గుమ్మడి, ఆంధ్రా ఎసోసియేషన్ కార్యదర్శి శ్రీ టి. వి. ఎన్. గుప్త వున్నారు. కూర్చున్నవారిలో దర్శకులు శ్రీ కమలాకర కామేశ్వరరావు, ఆంధ్రా ఎసోసియేషన్ అధ్యక్షులు శ్రీ ఇ. బి. ఆర్. నాయుడు, ఉపాధ్యక్షులు శ్రీ డి. ఎ. ఎల్. ఎన్. మూర్తి వున్నారు.



## "సారూప్యం"

తలకట్టు లేని హల్లులా జీవితం
కాళ్ళు తెగిన బల్లిలా గమనం —
వెలగని మతాబులా జీవితం
ఎగరని తారాజువ్వలా ఆదర్శం —
విషం లేని తేలులా అహం
నిషా లేని మద్యంలా జులుం —

— పి. రంగనాథ్

నా దగ్గరికి వచ్చే ప్రయత్నం అయినా చేయలేవా...

నెహ్రూ క్షణం ఆలోచించి బుర్ర గోక్కుంటూ 'చూస్తాను' అన్నాడు. ఇద్దరూ లేచి నిలబడ్డారు. చీకటి పడింది. లైట్లు వెలిగాయి. డ్రైవర్ కారు సిద్ధం చేశాడు యింటికి వెళ్లిపోయేందుకు.

*   *   *

వనిత నిర్ఘాంతపోయింది గాంధీ పూర్తిగా చెప్పి 'నేనేం చేయను. అతను చాలా పట్టుదలగా వున్నాడు. నేను మాట యిచ్చాను' అన్నాడు.

వనిత గొణుక్కుంటున్నట్లుగా అంది. 'ఇప్పుడు అర్థం అయింది నేను చేసిన పొరపాటు. నాన్నగారు బలవంతం చేశారనీ, రాబోయే భవిష్యత్‌లో చీకటిని ఎదుర్కోలేననీ అనుకుని చేశానీ పని... నావల్ల కాదు నెహ్రూ లేకుండా బ్రతకడం... వనిత ఏడుస్తూంటే గాంధీ కనుబొమ్మలు ముడిపడి పోయాయి. అతను గదిలో పచార్లు చేస్తూండి పోయాడు.

కాసేపటికి వనిత ఏడుపుని ఆపేసింది. గదంతా తిరుగుతున్న గాంధీ కూడా నిలుచుండిపోయాడు. 'నాకు ఏడ్చేవాళ్ళంటే చాలా భయం వనితా. నేను ఏడుపుని భరించలేను. నాకంతా అయోమయంగా వుంది. పోనీ నేనే వెళ్లిపోనా...'

వనిత జాలిగా నవ్వింది : 'ఇప్పటికే నేను నలుగురికీ అపహాస్యమైపోయాను. మీరు వెళ్లిపోతే... వనిత అప్రయత్నంగా గుండెమీద చేయి వేసుకుంది. 'ఒద్దు. మీరు వెళ్లిపోయి నన్నింకా నవ్వులపాలు చేయద్దు.' అంది.

గాంధీ చేతికి దగ్గరగావున్న పుస్తకాల రాక్‌లోంచి 'మహాత్ముల చరిత్రలు' పుస్తకాలు తీసుకుని గది బయటికి వెళ్లిపోయాడు. వనిత తండ్రి గదిలోకి వెళ్లింది. అప్పటికే నెహ్రూ ఆయన పక్కన చేరి ఏమేమో చెబుతున్నాడు. వనిత గుండె ఆగినంత పనైంది.

నెహ్రూ వయసు పన్నెండు సంవత్సరాలు. రేపోమాపో పన్నెండేళ్ళూ నిండుతాయి. ఎవరో చెప్పినట్లు ... తన గది విడిచి యిలా ఎప్పుడూ లేనిది తండ్రి పక్కకి చేరాడేం ? ఆమెకు సిగ్గుతో, అభిమానంతో తల వాలిపోయింది. నెహ్రూ మొహం చూసేందుకు సాహసంలేదు. మెల్లగా అడుగుల చప్పుడు వినబడకుండా యివతలకి వచ్చేసింది.

[ఇంకా వుంది]

# * మినీ ఇంటర్వ్యూ *

మన యువతరంలో వ్యాపకాలు చాలా ఎక్కువేగాని 'హాబీ'లు అనదగ్గవి వాటిలో చాలా కొంచెం వుంటూన్నాయన్న అపవాదున్నది. సాధారణంగా 'సినిమా క్రిటిసిజం' — లేదా 'రచనా వ్యాసంగం' యీ రెండే మన యువతీ యువకుల్లో ఎక్కువగా కనపడే హాబీలు. దీనిక్కారణాలు మన సొసైటీలో పెట్టుబడి అక్కరలేనివి సులువుగా దొరికేవి యివే ! ఎప్పుడో అరుదుగా అదృష్టవశాత్తు, "స్టాంపులు కలెక్ట్ చేయడం" "బర్డ్ వాచింగ్" (అంటే పక్షుల పరిశీలన) "వాటర్ కలర్ పెయింటింగ్స్" "స్కయి స్కానింగ్" అవుట్‌డోర్‌లో క్రికెట్, హాకీ, యిన్‌డోర్‌లో 'చదరంగం' 'క్రాస్‌వర్డ్ పజిల్స్' లాంటి హాబీలు గల యువతీ యువకులు తటస్థపడుతుంటారు !



సుమారు గజం పొడవూ, అడుగు అడుగున్నరా, వెడల్పూ వున్న పటాలు వో పాతికదాకా తీసుకుని రాజమండ్రి నుంచి బాలాజీ అనే టెన్త్ క్లాసు స్టూడెంట్ వచ్చాడు. [ఎస్కార్టుగా వాళ్లనాన్నగారున్నారు లెండి.] ఆ పటాలన్నీ యీ పధ్నాలుగేళ్ల బాలుడు స్వయంగా యిరవై సూత్రాల పథకంమీద, ఎమర్జన్సీమీదా గీసిన "డ్రాయింగ్స్."

పెద్ద కళ్లు ఆ అబ్బాయి పెట్టుకున్న కళ్ళద్దాలలో నుంచి యింకా పెద్దవిగా కనపడుతున్నాయి. వాళ్ల వూరు టౌన్ కాంగ్రెసు మొదలు చాలా రోటరీ క్లబ్‌లదాకా ఎన్నోచోట్ల ఈబొమ్మలకి ఫ్రేములు కట్టించి ప్రదర్శనలు చేశాడు. పధ్నాలుగేళ్ల చిరుతప్రాయంలో అంతకు రెట్టింపు సంఖ్యలో చిత్రకళా ప్రదర్శనలు యిచ్చిన యీ బాలుడు రాజమండ్రి మ్యునిసిపల్ స్కూల్‌లో చదువుకుంటున్నాడు. బెజవాడలో ప్రదర్శన ఏర్పాటుకి పిలుపురాగా వచ్చాడుట.

మెత్తగా, మెళకువగా మాట్లాడే యీ 'బాలాజీ' బ్రష్‌తో బొమ్మలు వేయడమేకాదు స్కూల్లో మంచి మార్కులు తెచ్చుకుంటానన్నాడు. పోయినేడాది మెరిట్ స్కాలర్‌షిప్ కూడా సంపాదించాట్ట.

రాజమండ్రి దామెర్ల రామారావుగారి కళాశాలలో వాళ్లక్కయ్యలు డ్రాయింగ్ నేర్చుకుందామని జాయిన్ అయితే నాలుగోఏటనే బాలాజీ కూడా తోకలాగ వెళ్లేవాడట !

అక్కడ మాష్టరు బాలాజీకి బొమ గీయడంలో గల శ్రద్ధ గమనించడంతో బా పధ్నాలుగేళ్లకే 'ఎమర్జన్సీ' మీద, దాని అవ మీద చిన్న ఉపన్యాసంకూడా — బాగా మననంచే చెబుతూ — బొమ్మలు గీయగలిగాడు.

ఈ డ్రాయింగుల ఎగ్జిబిషన్‌లు ఏర్పాటైపోడం ఎక్కువ యిటే, "కాన్‌సెన్‌ట్రేట్" చేస్తున్నా వుంది.

హైదరాబాద్ తెలుగు ప్రపంచ సభల్లో కు యితని బొమ్మలు ప్రదర్శించారటగాని, శ్రీ గాంధీకి యీ బొమ్మలు ప్రెజెంట్ చేద్దామని అవకాశం దొరకకపోవడంతో కొంచెం నిరాశచెంద "బాలాజీ."

'బాలాజీ' ఒక్కడేగాని అతనికి ము రక్కయ్య లున్నారు. 69 లోనే మొట్టమొ ప్రయిజు సంపాదించుకున్న ఈ బాలుడు తండ్రి ఆర్థిక స్తోమతని గుర్తెరిగి, టెన్త్‌క్లాస్ అయ హైదరాబాద్ నెహ్రూ టెక్నాలజిక యూనివర్సిటీలో డ్రాయింగ్ డిప్లొమో చద కుంటూనే నైట్ కాలేజీలో యింటర్‌మీడియే కూడా చేస్తానంటున్నాడు.

ప్రశ్న లడిగితే సమాధానాలు ఎదుటి అభిరుచిని పసిగట్టి మరీ చెప్దామని ప్రయత్నం "బాలాజీ"కి వార్తాపత్రికలతో పరిచయం బా వుంది. కేంద్ర మంత్రులు, రాష్ట్ర మంత్ర పేర్లు అవీ చెప్తాడు. "ఎమర్జన్సీ"ని సమర్థిసు 'డిబెట్' పెడితే ప్రయిజుకూడ కొట్టేయగల చిన్న వయసులోనే యింత ప్రజ్ఞ చూపించే బాలుణ్ణి తండ్రిగారుకూడ బాగా "ఎంకరేజ్ చేస్తున్నారని చెప్పాడుకాని అతన్ని సొంత 'ఎదగనివ్వాలి' అదే యింత 'టాలంటెడ్ బా భవిష్యత్‌కి బంగారు పునాది ! బాలాజీ లైబ్రరీలలో బుక్సు చదువుతాడు. "పత్రిక వీక్లీ డైలీ కూ ఎప్పుడు ఖాళీగా వుండవండి ! అవి ఎవరో ఒక చదువుతూనేవుంటారు." అన్నాడు. చెప్పాను యీమధ్య పత్రిక చదివావా ? అంటే లేదు— చెప్పడు. ఇలాగా లౌక్యంగా వుంటాయి ఈ చిరం జవాబులు. 'పికాసో' అభిమానినన్నాడు కాని అ పూర్తి పేరు తెలుసా ? నీకు అంటే "లేదం అతని గురించి తప్పక తెలుసుకుంటానం అన్నాడు. "పాడవోయి భారతీయుడా" సిని చూశాడుట. నచ్చిందది. దేశభక్తి — క్రమశిక్ష "యీ రెండేనండీ నాకు నా "కుంచె"కూ ధీమ అన్న యీ అబ్బాయికి మంచి 'భవిష్య వుంటుందని నమ్ముతాను. [ వీరా

విజయనగరం,
23–8–76.

హానికి, అమ్మ దీవించి వ్రాయునది :

నువ్వు నీ క్యాంప్ నించి విశాఖపట్నం తిరిగి వచ్చేసరికి, నీకీ ఉత్తరం అందుతుంది. నీకు చెప్పకుండా యిల్లు వదిలిపెట్టేను. మరో పరిష్కార మార్గం నాకు కనిపించలేదు. కాని నిన్ను చూడకుండా ఒక్కరోజన్నా గడపడం నాకెంత కష్టమో నీకు తెలుసు. నా ప్రాణాలన్నీ నీమీదే పెట్టుకొని నీకోసమనే బతికేను. మరి నా బతుకులో ఏం మిగిలిందని బతికేను ? పాతికేళ్ల క్రిందనాటి ఆరోజు తలచుకుంటే ఇప్పటికీ ఒళ్ళు కరుడుకట్టుకు పోతుంది !




*        *        *

ఆరోజా సాయంత్రం చల్లగా వుంది. .చల్లగాలి హాయిగా వేస్తోంది. పిల్లలంతా వీధిలో పిచ్చుకగూళ్ళు కట్టుకొని ఆడుకుంటున్నారు.

సరస్వతి జడ వేసుకుంది. ముఖం సేండల్‌వుడ్ సబ్బుతో రుద్దుకొని, పాండ్స్ పౌడర్ అద్దుకుంది. సిగలో మల్లెలు తురుముకుంది. భర్త నిన్న తనకోసం కొనితెచ్చిన వాయిల్‌చీర కట్టుకుంది. ఆరోజు ఆమె పుట్టినరోజు. పాతిక వసంతాలు నిండేయి. చిగుళ్ళతోనూ, పూలతోనూ నిండుగా వున్న మామిడిచెట్టులా వుందామె. మనస్సులో ఆనందపు కోయిలలు కూస్తున్నాయి.

బయట మట్టిలో ఆడుకుంటున్న కొడుకుని పిలిచింది. "నాన్నారు వచ్చే వేళయింది—లోపలికొచ్చి, మొహం కడుక్కొని. బట్టలు మార్చుకో రామం ! నువ్వు రావా పాతాళభైరవి సినీమాకి ?"

"ఇదుగో వచ్చేస్తున్నానమ్మా ! నాన్నారు రానీ ముందు !" ఏడేళ్ల రామం కేకపెట్టేడు తిరిగి.

మాటిమాటికీ వీధిలోకి వెళ్లి తొంగిచూస్తూ భర్తకోసం కాచుకొనివుంది సరస్వతి.

సినిమా ప్రారంభం అయే వేళ అయిపోయింది కాని అతను రాలేదు ఆఫీసునించి.

ఆకాశం విరిగి నేలమీద పడుతుందా ? పడదు. కాళ్ల క్రింద భూమి నిల్చున్నపాళంగానే విడిపోతుందా? విడిపోదు.

కాని, మానవ జీవితంలో అటువంటి అనుకోని సంఘటనలే జరుగుతూవుంటాయి.

ఆఫీసునించి ఇద్దరు క్లర్కులు వచ్చి అటువంటి సంఘటనే జరిగిందని చెప్పేరు — ఆకాశాన్ని ఆమె నెత్తిమీద వేసేరు. భూమికి ఆమె కాళ్లకిందే కన్నం పడేలా చేసేరు.

ఆఫీసు వదిలేక, బయటకొచ్చి, సైకిలు తియ్యబోతూ మొహం తిరిగి పడిపోయేడుట ఆమె భర్త — హాస్పిటల్‌లో చేర్చి చెప్పడానికి వచ్చేరు — తోడ్కుక వెళ్లేరు.

మనిషికి ఏక్సిడెంట్ జరుగుతే ఇలా కాని, అలా కాని జాగర్త పడితే అది జరిగి ఉండకపోను అనుకోవచ్చు — కేన్సర్ వస్తే, సిగరెట్లు ఎక్కువ కాల్చడం వల్ల అని కారణం చెప్పకోవచ్చు — దేనికన్నా మందుంది, ఎందుకు వస్తుందో తెలుస్తుంది — రాకుండా జాగర్తపడొచ్చు.

కాని "సెరిబ్రల్ హెమొరేజ్"కి కారణమూ లేదు, మందూ లేదు — మెదడులో ఒక ప్రాంతంలో బ్లడ్‌సెల్ పేలిపోయి రక్తస్రావం జరుగుతుంది మెదడులో — తెలివి పోతుంది — మరి రాదు. 'కోమా'లో ఉండి ఉండి ప్రాణం పోగొట్టుకుంటాడు రోగి.

అదే జరిగింది సరస్వతి భర్తకి —

ఆమె హాస్పిటల్ చేరుకొనేసరికి చూసింది అతడి మృతదేహాన్ని.

ఆ షాక్‌తో తెలివి పోగొట్టుకుని కూలిపోయింది.

*        *        *

రామం ! ఆ రోజునుంచీ చావాలనే ఉండేది — కాని అందరూ నీ కోసం నేను బతకక తప్పదన్నారు. నీ కోసమే బతికేను. నా పుట్టింటికి వెళ్లినా అది నా కాళ్లమీద నేను నిలబడగలిగేవరకే ననుకున్నాను. మెట్రిక్ పాసయి, ట్రెయినింగయి ఆడపిల్లల చిన్న స్కూల్లో టీచరుగా చేరేను. తరవాత ప్రయివేటుగా కట్టి బి. ఏ. పాసయ్యేను. బి.యిడీ ట్రెయినింగ్ అయ్యేను.

నా కొకటే కోరిక — నిన్ను ఒక మంచి డాక్టర్‌గా చెయ్యగలగాలని — నీమీదే నా ప్రాణం పెట్టుకొని రోజులు గడిపేను. నీ ఆలనా, పాలనా, చదువూ అన్నీ స్వయంగా చూసుకొనేదాన్ని—ఎవ్వరినీ నీ సంరక్షణకి దగ్గరకి రానిచ్చేదానిని కాను. నా భయం ఒక్కటే — మానసికంగా నువ్వు నానుండి ఎక్కడ దూరంగా అయిపోతావేమోనని నా భయం.

నువ్వు మాత్రం ! ? ఒక్క క్షణమన్నా అమ్మ అగపడకపోయేసరికి కొట్టుకపోయేవాడివి. అమ్మే అన్నం పెట్టాలి... బట్టలు అందివ్వాలి... చదువు చెప్పాలి... ఎక్కడికి వెళ్లినా అమ్మ తోడుగా ఉండాలి.

నిన్ను పెంచుకుంటూ, చూసుకుంటూ, నీ అభివృద్ధి చూస్తూ బాధలన్నీ మరిచిపోయి, ఏళ్లు నిముషాలుగా గిడిపేసాను.

డాక్టరు వయ్యేవు ! ఆ రోజున నా ఆనందం ఏమని చెప్పను !

నా దీక్ష ఫలించింది ! మరో రెండేళ్లు కష్టపడి ఎమ్. డి. చేసేవు — ప్రాక్టీసు పెట్టేవు. బీద వాళ్లకి సాయపడడమే ఆదర్శంగా పెట్టుకోమన్న నా మాట మన్నించేవు — చుట్టుపక్కల పల్లెలకి కూడా వెళ్లి అక్కడ పల్లె ప్రజల బాగోగులు చూసేవాడివి — మూడు పువ్వులూ ఆరు కాయలుగా నీ ప్రాక్టీసు వృద్ధిపొందింది.

ఏ ఊరన్నా వెళ్లి మూడు రోజులు ఉండవలసి వస్తే నేను ఉండనిదీ వెళ్లేవాడివి కావు—నా ఉద్యోగం మానిపించేవు — అమ్మ లేనిదీ ఒక్క క్షణమన్నా ఉండలేనేవాడివి — నేను మాత్రం నిన్ను వదిలి ఉండగలిగేదానినా ?

కాని నాకెందుకో మనసులో ఒక భయం! ఇదంతా శాశ్వతం కాదని — నువ్వు నాకు కాకుండా దూరంగా పోతావన్న భయం! మన ఇద్దరి మధ్యా ఉన్న అనుబంధానికి విఘాతం కలుగుతుందన్న బెదురు — అందువల్లే, నీ పెళ్లి మాట ఎవరన్నా తలపెడితే గుండె ఆగిపోయినట్టయేది. నీమీద నాకున్న మమకారం, అనురాగం మరొకరితో పంచుకోలేను — నీ మనసులో నామీద ఉండే ఆత్మీయతని మరొక స్త్రీ వస్తే తగ్గించేస్తుందన్న భయం నాకు ఎక్కువయింది. ఎవరు నీ పెళ్లి ప్రసక్తి తెచ్చినా ఆ ప్రసంగం మార్చేదాన్ని —

ఆనాడు నువ్వు డాక్టర్ వెంకట్రావుగారి ఇంటికి వెళ్దామని తీసుకవెళ్లేక (అతనింటికి నేను ఎప్పుడూ వెళ్లలేదు.) అక్కడ అతడి కూతురు సు శీ ల పరిచయం నాకు కలిగినప్పుడు నేను కట్టుకున్న మేడ కూలిపోయినట్టయింది. ఏ వంక చెప్పగలను ? అందం, గుణం, చదువు, సంస్కారం, వంశం, హోదా, డబ్బు అన్నీ ఉన్నివిధాలా సరిపోతున్నప్పుడు, ఆ పిల్లమీద నీ మనసు ఉన్నప్పుడు ఏ సాకు చెప్పి తప్పించగలను ? సుశీలే మన ఇంట కాలుమోపితే ఇంట్లో నా స్థానం ఏమౌతుందో ఊహించుకుందుకి అట్టేసేపు పట్ట లేదు. ఆ అందానికి నువ్వు బానిసవవుతావు — నాతో ఇంక మనసు విప్పి మాట్లాడవు. "నువ్వు నానుంచి దూరంగా పోతే నేను బతకలేను ! నా కన్యాయం చెయ్యకు !" అని అరవాలనిపించింది. మనసులోనే కన్నీళ్లు కార్చేను.

సుశీలతో నీకు పెళ్లి జరిపించేను.

ఆ రోజునించీ నా యమయాతన ఆరంభ మయింది. నువ్వు నవ్వుతూ సుశీలతో మాట్లాడ్డం చూసినా, సుశీల ఆనందంగా, సంతోషంగా ఉండడం చూసినా నా మనస్సు మంచులా గడ్డ కట్టేది. నీమీద కోపం వచ్చేది సుశీలమీద మనస్సు మండి పోయేది. నీమీద అలిగి నీతో మాటలు మానేదానిని. అన్నం తినడం మానేదానిని — నువ్వొచ్చి బతిమి లాడినా, నా కాళ్ళు పట్టుకున్నా, సుశీల వచ్చి ప్రాధేయపడ్డా తిండి తినేదానిని కాను. మీ ఆనందం తన్మూలంగా భంగమయి మీరిద్దరూ నాకోసం బాధ పడితేనే తప్ప నాకు ఆనందం, తృప్తి ఉండేవికావు.

కాని నువ్వు నొచ్చుకొని బాధపడగా నాకూ బాధవేసేది. జాలి వేసేది. నీ ఆనందం పాడుచెయ్య డానికి నాకుండే హక్కేమిటనిపించేది. భార్య భార్యే, తల్లి తల్లే అనిపించేది. మళ్లీ రెండ్రోజులు గడవ గానే మీ ఇద్దరూ ఆనందంగా ఉన్నా, నన్ను కాదని, నాతో చెప్పకుండా ఏ పని చేసినా, చెట్టాపట్టా వేసుకొని తిరగడానికి పోయినా మళ్లా మంటలు మనసులో మండేవి.

రాను రాను నా మాటలతో మీ ఇద్దరి మనసునీ బాధపెట్టేను. నేను నీకోసం చేసే ఏ పనిని కూడా సుశీల చేత చెయ్యనిచ్చేదానిని కాను. ఎందు లోనూ, ఏ పెత్తనమూ లేకుండా చేసేను దానికి. దానిమీద చాడీలు చెప్పేదానిని. క్రమేపీ నువ్వు నా దగ్గరకు రాసాగేవు మానసికంగా —

కాని, నేను అనుకోనిది ఒకటే — సుశీల నామీద తిరగబడుతుందని ఏనాడూ అనుకోలేక పోయేను. తన ఆస్తిని రక్షించుకొనే అడవిమనిషిలా మీదని కలియపడింది. మాటకి మాట జవాబిచ్చేది. క్రమేపీ నా మనసుని గాయపరచే మాటలు అనసాగింది. తిరిగి జవాబిస్తే కలియపడేది !

* * *

ఒక రోజున రామారావు రాత్రి పదయినా రాలేదు.

సరస్వతి వంట ఇంట్లో కూర్చుంది కొడుకు వస్తే అన్నం పెడదామని. ఏదో పుస్తకం చదువు కుంటోంది — సుశీల వచ్చి అంది: "మీరు వెళ్లి పడుకోండి — నేను వడ్డించేస్తాను లెండి ఆయనొస్తే !"

సరస్వతి : "నాకు తెలివేసి ఉండడం అలవాటే - నువ్వు తెలివేసి ఉంటే నీ ఆరోగ్యం దెబ్బతింటుంది."

సుశీల : "నా ఆరోగ్యం గురించి మీ కంత ఆతృత, శ్రద్ధా ఎందుకో ?"

"కోడలివి కనక !" వెటకారంగా అంది అత్తగారు.

"అంతేకాని నేను వడ్డిస్తే ఒప్పుకోరు! అంతేనా ? నేనేమన్నా విషం కలిపిపెడతానని భయమా ?" కోడలు కూడా వ్యంగ్యం జోడిం ఘాటుగానే అంటించింది.

సరస్వతికి కోపం బుసలు కొట్టింది — విసురు చెప్పింది. "ఏమో ! అంత పని చేసినా చేస్తావ్ !"

"విషం కలుపుతే నేను ముండమొయ్యనా ?' కసిగా ఒరిచింది సుశీల భరించలేక —

ఆ తరవాత పెద్ద రభస జరిగింది. ఆదంత రెండో ఉత్తరంలో ఉంది.

సుశీల కళ్లవెంబడి బొటబొటా నీళ్లు కారేయి. "నన్ను మీ ఇష్టం వచ్చినట్టు మాటలు అనొచ్చు — కాని నేను నోరు ఎత్తడానికి వీల్లేదు. మీ అబ్బాయికి పెళ్లెందుకు చేసేరు ? ఇద్దరూ కలిసినా గొంతెదుకు నొక్కేరు ?"

ఆ సమయంలో రామారావు వచ్చేడు.

జరుగుతున్నది చూసి చేష్టలుడిగి నిలబడి పోయేడు.

* * *

నువ్వు పడే బాధ చూసి నా మనసు తరుక్కు పోయేది. సుశీలంటే నీ కెంత ప్రేమో నాకు తెలుసు — నేనంటే నీకున్న అభిమానమూ నాకు తెలుసు.

ఎవరి పక్షమూ వహించలేక నువ్వు పడే నరక యాతన చూస్తే, సుశీలమీద నా ద్వేషం పెరిగిందే కాని తగ్గలేదు.

నువ్వు ఇంటికి రావడమే తగ్గించుకున్నావ్ — ఈ ఊరూ ఆ ఊరూ క్యాంప్‌లంటూ తిరగడం ఆరంభించేవు. మా ఇద్దరితోనూ మాటలు తగ్గించేవు. చిక్కి శల్యమై పోయేవు — నేను నీ బాధ చూడలేను. సుశీల కళ్లలో నామీద ఉండే ద్వేషమూ భరించలేను.

కిందటి ఆదివారం నువ్వు వారం రోజుల వరకూ రావని చెప్పి అరుకువేలీ వెళ్లిపోయేవు.

నువ్వు వెళ్లిన రెండు రోజుల తరువాత మాట మీద మాట వచ్చి నామీద తిరగబడింది సుశీల — అనరాని మాటలంది. ఆమె మాటల సారాంశం ఇది.

"నువ్వు రాక్షసివి — నువ్వు ముండమోసేవని, నా మొగుడు బతికుండగానే నాచేత ముండమోయిద్దా మని నీ ప్రయత్నం నన్నూ అతన్నీ వేరు చేసి — నీ మొహం మరి చూడను. ఈ ఇంట్లోంచి పో — ఈ ఇల్లు నాది — నీ కిక్కడ హక్కు లేదు !"

ఇలా అర్థం వచ్చే ఎన్నో మాటలంది — నేను మరి వినలేకపోయేను. నేను ఇల్లు వదిలేసి నా అన్న దగ్గరికి వచ్చేసేను ఆ రాత్రే —

నువ్వు లేకుండా... నిన్ను చూడకుండా, నేను బతకలేను... ఆ ఇంట్లో రోజూ సుశీల ద్వేషాన్నీ, తిరుగుబాటునీ ఎదుర్కుంటూ ఉండనూలేను.

దీనికి పరిష్కార మార్గం నువ్వే ఆలోచించు— నాకు ఒకే దారి కనిపిస్తోంది — చావు !

ఈ ఉత్తరం నీకు ఎల్లుండి కందుతుంది ఎంత ఆలశ్యమయినా — నువ్వు ఇవాళ క్యాంప్‌నుంచి వచ్చేసి ఉంటావు. నువ్వూ కోడలూ వచ్చి నన్ను పిలిచి తీసుకవెళ్తే సరేసరి — ఆమె ప్రవర్తనకి ఆమె క్షమాపణ చెప్పుకోవాలి — నేనింక మీ జోలికి రాను — నిన్ను చూసుకుంటూ ఆఖరి రోజులు గడిపేస్తాను.

(32 వ పేజీ చూడండి)

## [దా]న వీర శూర కర్ణ [వి]శేషాలు

"దాన వీర శూర కర్ణ" అవుడ్డోర్ షూటింగ్ [..] నవంబరువాడు మొదలవ్వల్సింది కాని వాన [క]ష్టంచేత మర్నాడుకి వాయిదా వేశారు. 7వ తేదీ [పొ]ద్దునే స్టూడియోకి వెళ్లాను. అక్కడ ఎసిస్టెంట్ [డై]రెక్టర్ ప్రసాద్ ఒక్కడే ఉన్నారు. మిగతా [వా]ళ్లంతా అయిదు గంటలకే షూటింగ్‌కి వెళ్లి [పో]యారు. మేమిద్దరం వాళ్ల బస్సెక్కి మల్కాజీగిరి [దా]కా వెళ్లాము. దారిలో టైరు బర్స్టయింది. [అం]దుకని మిగిలిన మూడు మైళ్లు నడిచివెళ్లాము.

అప్పటికి 11 దాటింది. కొన్ని షాట్‌లు [పూ]ర్తి అయిపోయాయి. రామారావుగారు డైరెక్ట్ [చే]స్తున్నారు, అభినయం చేస్తున్నారు, కెమెరాలో [నుం]చి చూస్తున్నారు, పనులు పురమాయిస్తు[న్నా]రు — అంతా ఆయనే! కొన్ని బొమ్మలు తీశాను. మర్నాడు వెళ్లలేకపోయాను కాని తొమ్మిదవ తారీఖు పొద్దునే నేరుగా షూటింగ్ జరుగుతున్న చోటుకే వెళ్లాను.

'చక్రధారి'లో రామకృష్ణ, వెన్నిరాడై నిర్మల



## ★ దాన వీర శూర కర్ణలో దృశ్యాలు ★

అంబారీ ఎక్కిన ఎన్. టి. ఆర్. రథం ప్రక్కన బాలకృష్ణ



### సినిమా విశేషాలు

ఆ రోజు మాత్రం కొన్ని విశేషాలు గమనించాను. రామారావుగారికి మాట్లాడి, మాట్లాడి గొంతుక పోయింది! అందుకోసం ఆయన లౌడ్‌స్పీకర్ ఒకటి వాడవలసివచ్చింది. ఒకసారి కృష్ణుడు మురళిని వదులుకుని మైక్రోఫోన్ పట్టవలసివచ్చింది...

ఒకసారి రామారావుగారు ఏనుగ ఎక్కవలసి వచ్చింది. ఏనుగుని కూర్చోపెట్టాలికదా? మావటీవాడు కెమెరామాన్ సహాయంతో దానిని సరయిన చోట కూర్చోపెట్టటానికి ప్రయత్నం చేసి చేసి చివరికి చిరాకుతో దానిని అంకుశంతో పొడిచాడు. అప్పుడు ఏనుగకి చాలా కోపం వచ్చి అంబారీని విదిలించివేసింది! ఏనుగుమీది అబ్బాయి కింద పడ్డాడు. రామారావుగారు మావటీవాడిని మందలించి, ఆ రోజు ఏనుగకి సెలవు ఇప్పించారు. అంతటితో ఊరుకోక దానికి మిఠాయి కూడా పెట్టించారు.

హరికృష్ణ, బాలకృష్ణ మొదలయినవాళ్లు ఎంతో సహాయం చేశారు కాని పని భారాన్ని ఎన్. టి. ఆర్. ఏమీ వదులుకోలేదు! కురుక్షేత్రాన్నంతా ఆయనే స్వయంగా నడిపారు!

మైక్ చేతబట్టిన కృష్ణుడు (ప్రక్కన అర్జునుడుగా హరికృష్ణ) [★] [★] [★] [★] లొట్టిపిట్టమీదఒక వీరుడు, నేలమీద తారక రామారావు [★] [★









'ఇంటిని దిద్దిన ఇల్లాలు'లో జయసుధ

షూటింగ్‌కి 600 మంది ఎక్‌స్ట్రాలు వచ్చారు. బీదర్ నుంచి ఒంటెలు వచ్చాయి... గుర్రాలు పోలీసువీ, మిలిటరీవీ కూడా...

ఆ రోజు కెమెరాని శ్రీ రహమాన్ వాడారు... రమేష్, ప్రసాద్‌లు డైరెక్షన్‌లో సాయపడ్డారు.

ఎప్పుడు విడుదల ? అని అడిగాను.

జనవరిలో... సంక్రాంతికి రిలీజ్ కావచ్చు; అని అన్నారు.

జనం బాగా ఎగబడ్డారు. పోలీసులు వాళ్లని అదుపులో పెట్టవలసివచ్చింది... కాని జనం ఎక్కడా హద్దు మీరలేదు, ఎంతో బాగా సహకరించారు... రామారావుగారు వాళ్లని అప్పుడప్పుడు పలకరిస్తూ ఉన్నారు కూడా... [మాటలు, బొమ్మలు శ్రీధర్].

## నెహ్రూ జన్మదినాన వెలసిన సంస్థ

పూజ్య నెహ్రూజీ జన్మ దినాన (నవంబర్ 14న) భాగ్య నగరంలో ఒక చిత్ర నిర్మాణ సంస్థ వెలసింది. సంస్థ పేరు ఫాల్కన్ యింటర్నేషనల్. అధినేత పేరు నాగేష్.

## సీతీ ! నీ విలువెంత !

ఫాల్కన్ యింటర్నేషనల్ తలపెట్టిన చిత్రానికి యిడిన పేరు యిది. కథలో కొత్తదనం వున్న నిజం మకుటమే సూచిస్తుంది కదూ !

షూటింగ్ చూస్తున్న ఎన్.టి.ఆర్. కుటుంబ సభ్యులు



నేటి సమాజంలో ప్రబలంగా పీడిస్తున్న నిరుద్యోగ సమస్యపై అల్లబడిన యీ సంచలనాత్మక చిత్రంలో ఒక యువజంట ఎదుర్కొన్న జీవిత సంఘటనలు జరుగుతున్న చరిత్రకు ప్రతిరూపంగా వుంటాయి అని, వివరించారు దర్శకుడు కె. ఎస్. రామిరెడ్డి.

అభ్యుదయ భావాలు, వున్నత ఆశయాలు, కొత్తదనం చూపెట్టాలన్న తాపత్రయం వున్న యంగ్‌మ్యాన్ శ్రీ రామిరెడ్డికి "సీతీ ! నీ విలువెంత" చిత్రం అనుభూతిని కలిగిస్తుంది.

ఫాల్కన్ యింటర్నేషనల్ చిహ్నాన్ని "హస్తవాసి" వున్న టాకూర్ వి. హరిప్రసాద్‌గారు ఆవిష్కరించారు. (మినీ రవీంద్ర భారతిలో) ఈ సంచలనాత్మక చిత్రానికి సంజయ్... మాణిక్యం సంగీతాన్ని, గణేష్‌పాత్రో సంభాషణాన్ని సమకూరుస్తున్నారు.

ఈ చిత్ర నిర్మాత నాగేష్‌గారిని పరిశ్రమలో అందరికీ తెలుసు. నటుడుగా స్థిరపడాలన్న యీ యువకుడు చిత్ర నిర్మాత గావడానికి ఒక ధనశక్తి అండగా నిలబడింది. ఆశక్తి వున్న వ్యక్తి పేరు. డాక్టర్ బాబు. (ఈయన జగమెరిగిన పైల్స్ డాక్టరు.)

## కృష్ణ దర్శకత్వంలో శోభన్ చిత్రం

రెండు విజయవంతమైన చిత్రాలను శోభన్ బాబుతో రూపొందించిన "సెభాష్ కృష్ణ" మరొక శోభన్‌బాబు చిత్రానికి దర్శకుడుగా పదవీ స్వీకారం చేశారు.

"ఖయిదీబాబాయ్, మొనగాడు" చిత్రాలను జనరంజకంగా మలచిన డైరెక్టర్ టి. కృష్ణగారిని నమ్మి చిత్రాలు నిర్మించవచ్చు అనేది నిజం ఋజువైంది.

ప్రముఖ వ్యాపారవేత్త వడ్డె రమేష్‌గారు జనవరి నుంచి ప్రారంభించనున్న ఈస్ట్‌మన్‌కలర్ చిత్రంలో "హీ-మాన్" కొత్తతరహా పాత్రను పోషిస్తున్నారు. ఈ చిత్రానికి టి. కృష్ణ దర్శకుడుగా యెంపిక అయ్యారు.

ఈ కలం శోభన్ ... కృష్ణ కాంబినేషన్నుంచి మరొక హిట్ చిత్రాన్ని ఆశిస్తుంది.

## అందాల నటుడి ఆధిక్యత

శోభన్‌బాబుగారిని అందాల నటుడు అని, "హీ-మాన్" అని మొట్టమొదట వ్రాసిన యీ విలేఖరి మాటలను ప్రేక్షకులు అంగీకరించి, అతగాడ్ని ఆశీర్వదించారు.

"హీ-మాన్" నటించిన చిత్రాలకు వసూళ్లు విపరీతంగా రావడాన్ని చూచినప్పుడు, ప్రజలు ఆయన్ను యెంతగా ప్రేమిస్తున్నారో అర్ధమవుతుంది.

1975 లో హిట్ చిత్రాల నటుడుగా ప్రసిద్ధి పొందిన శోభన్‌బాబు 1976 లో కాస్త నిరాశపరచినా, నిర్మాతలకు నష్టం తెచ్చిన సంఘటన కానరాదు.

1977 లో శోభన్‌బాబు "మంచి...మంచి" పాత్రలను పోషించి తన ఆధిక్యతను నిరూపించగలడని యీ విలేఖరి విశ్వసిస్తున్నాడు.

## త్రివిక్రమరావు కొత్త చిత్రం

"మొనగాడు" చిత్ర నిర్మాత త్రివిక్రమ రావును, యీ విలేఖరి నవంబర్ 12 న కలిశాడు. ఆరోజున ఆయనతోబాటు దర్శకుడు కృష్ణ కూడా వున్నారు.

"మొనగాడు" చిత్రం ఆర్థికంగా తనకు సంతృప్తిని కలిగించిన నిజాన్ని నిర్మాత వెల్లడించారు.

రాబోయే "మే" నుంచి శోభన్‌బాబుగారు కాల్‌షీట్లు యిస్తానని చెప్పినందుకు పత్రికా ముఖంగా తన సంతోషాన్ని వ్యక్తపరుస్తున్నారు విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ అధినేత.

'సావాసగాళ్లు'లో నాగేష్, రమాప్రభ





'పల్లెసీమ'లో రంగనాథ్, జయసుధ

## సినిమా

# "ప్రేక్షకుల అభిమానమే అవార్డు"

-విజయనిర్మల

*(గత సంచిక తరువాయి)*

'అవార్డుల కోసం చిత్రాలు నిర్మించే అభిప్రాయం వుందా?' ఈ ప్రశ్నకు ఆమె సమాధానం ఇలా వుంది.

"అవార్డు చిత్రాలు తీసేంత స్థాయికి నేనింకా ఎదగలేదు. నేను చాలా చిన్నదాన్ని. నేను తీసే చిత్రం ప్రజల ఆంగీకారాన్ని అందుకుంటుందా? లేక వారి అసంతృప్తికి గురి అవుతుందా? అనే చర్చనే ప్రధానంగా భావించి, తదనుగుణంగా చిత్రాలను తీయడంవరకే నా శక్తి పరిమితం అనుకుంటుంటాను నేను. ప్రేక్షకుల తియ్యటి తీర్పునందుకున్న ప్రతి చిత్రం అవార్డు నందుకున్నదనే నా వూహ. ఆడియన్స్ తీర్పే ఓ పెద్ద రివార్డు."

### ఎక్టోప్లాజమ్ ప్రభావం

'మీ "దేవుడే గెలిచాడు" చిత్రం థీమేమిటో చెప్పండి' అనడిగినందుకు నిర్మల యిలా చెప్పింది.

"కోరికలు తీరకుండా చనిపోయిన జీవుల ఆత్మలు యెలా పరిభ్రమిస్తాయి, తీరని ఆ కోరికలను తీర్చుకోవాలని యెలా ప్రయత్నిస్తాయి అనే అంశంపై మా "దేవుడే గెలిచాడు" చిత్రాన్ని తీయడం జరిగింది. కోరికలు తీర్చుకోకుండా చనిపోయిన కొందరి ఆత్మలు అవి వసించివుండిన ప్రాంతాలలో, అవి మసలిన మనుష్యుల మధ్య సంచరిస్తుంటాయని మనం అక్కడక్కడా వింటూ

### మృణాల్‌సేన్ తెలుగు చిత్రం

మదరాసు త్యాగరాయ నగర్‌లో ఆంధ్రులకు యిష్టమైన వంటకాలను పెట్టే హోటల్‌గా "సుప్రియ"కు పేరు వుంది.

హోటల్ వ్యాపారాన్ని అభివృద్ధి చేస్తున్న "సుప్రియ" హోటల్ అధినేత పరంధామిరెడ్డి తన దృష్టిని చిత్ర నిర్మాణంపై మళ్లించారు.

"మృగయా" చిత్ర దర్శకుడు, బహుముఖ ప్రజ్ఞావంతుడు అయిన మృణాళ్‌సేన్‌గారిని దర్శకుడుగా ఎంపిక చేశారు, రెడ్డి.

మార్చి నుంచి షూటింగు వుండగలదని పరంధామిరెడ్డి చెప్పారు.

1977లో రెండు వుత్తమ చిత్రాలను మన ప్రేక్షకులు వేయి కండ్లతో ఎదురు చూడొచ్చు. తెలుగువారి "మెదడుకు మేత" యికపై ఏర్పడగలదు.

### కొత్త సంవత్సరంలో ఈతరం మనిషి

ప్రముఖ నవలా రచయిత్రి మాదిరెడ్డి సులోచన రచించిన "మిస్టర్ సంపత్" నవల నాధారంగా తీసుకుని పల్లవి ఆర్ట్ పిక్చర్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించిన చిత్రానికి "ఈతరం మనిషి" అని పేరు పెట్టారు.

శ్రీ విక్టరీ దర్శకత్వం, వెంకటరత్నంగారి ఛాయాగ్రహణం, ఆచార్య ఆత్రేయ రచనావైభవం, చక్రవర్తి సంగీత సామర్థ్యం పోటీపడి పని చేసిన యీ వర్ణ చిత్రంలో "ఈ తరం మనిషి"గా శోభన్‌బాబు కొత్తతరహా పాత్రను ఎంతో శ్రద్ధతో పోషించారు.

ఈ చిత్రంలో లక్ష్మి, జయప్రద, రావు గోపాలరావు ధరించిన పాత్రల్లో వెరైటీ కనిపిస్తుంది. లక్ష్మి ఫిలింస్ విడుదలచేసే యీ చిత్రాన్ని ఎస్. వెంకటరత్నం, రవీంద్రనాథ్ నిర్మించారు.




# జెమినీ టీ

## రుచికి రాజమకుటం ఈ టీ




ఇదుగో సిరులెన్నో ఉప్పొంగే జెమినీ టీ.
రాజదర్బారు యొక్క అనుభవం చవిచూస్తారు మీరు.
ఆ దర్జా రాసికి చెందిన చిక్కని టీ.
అందుకే మీకు మరిన్ని కప్పులనిస్తుంది.
ఇది మీరు ఉత్సవం జరుపుకునేలాంటి పొదుపు.
ఇంకనుంచి ఉత్సాహంతో ఉవ్విళ్ళూరండి, జెమినీటీతో.

**జెమినీ టీ టాటా-ఫిన్లే వారిది.**

dCA/TFGT/2c Tel.



'దేవుడే గెలిచాడు'లో విజయనిర్మల

# సినిమా

వుంటాం. ఇది నిజమని కొందరు, కాదని యింకొందరు వాదించుకుంటూ వుంటారుకూడా. ఇది అబద్ధం మాత్రం కాదని జర్మనీ – ఇటలీ దేశాల్లోని కొందరు ప్రొఫెసర్లు 26 స్పిరిట్స్ యొక్క గొంతుకలను టేప్‌రికార్డ్ చేసి నిరూపించారు. ప్రొఫెసర్ క్రూక్స్ ఎక్టోప్లాజమ్ అనే ఫిలింతో యీ స్పిరిట్స్‌పై ఓ ఫిలింకూడా తీసి పై నిరూపణను మరింత నిర్దుష్టం చేశారు. ఆ పిక్చర్ ఫొటోలన్నీ తెప్పించి, ఎన్‌లార్జ్ చేసి, మా "దేవుడే గెలిచాడు" చిత్రంకోసం వర్క్ అవుట్ చేసాము. మా చిత్ర ఛాయాగ్రహణ దర్శకుడు గోపాలకృష్ణ స్పిరిట్స్‌పై ప్రత్యేక పరిశోధన చేశారీ చిత్రంలో."

## టైమ్ అనేది అత్యవసరం

'అయిదు చిత్రాల దర్శకత్వ అనుభవంతో యిన్ని లక్షల్లోనే చిత్రాలు తియ్యొచ్చు అని మీరు నిర్ధారించి చెప్పగలరా?' అన్న ప్రశ్నకు సమాధానంగా—

'ఈతరం మనిషి'లో శోభన్‌బాబు, జయప్రద



"ఇంతలోనే చిత్రం తీస్తాను మిరుదుగా చెప్పడం కష్టమే. ఎందుకంటే అనుకోకుండా కొన్ని సమయాల్లో కొన్ని యిబ్బందులు యెదురౌతుంటాయి. ఉదాహరణకు అవుట్‌డోర్ చిత్రీకరణ చేద్దామని ఆరోజు అనుకుంటాం. అందుకు కావల్సిన ఏర్పాట్లన్నీ చేసేసుకుంటాం. కానీ వాతావరణం ఆరోజు ఎదురుదెబ్బ తీస్తే ఎవరు మాత్రం ఏం చేస్తారు. చేసిపెట్టుకున్నదంతా వ్యర్థమవుతుంది. నష్టమొస్తుంది. ఇలాంటి నడమంత్రపు నష్టాన్ని ముందే వూహించలేముగదా. ఇంకా యిలాంటి అవాంతరాలు వస్తుంటాయి. అందువల్ల ఇదమిద్ధంగా యింతలోనే చిత్రం తియ్యొచ్చు అని చెప్పడం అంత సులభంకాదు.

మా "దేవుడే గెలిచాడు" ప్రారంభోత్సవం ముందు కృష్ణగారి కాల్‌షీట్ ఒక్కటే వుండింది మాకు. కానీ ధైర్యంగా చిత్రం మొదలెట్టాను. కాలం కలిసొచ్చింది. ఆ కాల్‌షీట్, యీ కాల్‌షీట్ అంటూ కాన్సిల్ అయి (అనుకోని సమస్యవల్ల) మా చిత్రానికి ఆ కాల్‌షీట్స్ వుపయోగించుకునే అవకాశం కల్గింది. మా చిత్రంలో నటించిన నటీనటులందరూ, పని చేసిన సాంకేతిక నిపుణులందరూ తమ సంపూర్ణ సహకారాన్ని యిచ్చిన కారణంగా "దేవుడే గెలిచాడు" చిత్రాన్ని 28 రోజుల్లో పూర్తిచేయగలిగాము. కాల్‌షీట్స్ కుదరక, టెక్నీషియన్లు సరిగా పని చెయ్యకపోతే యింత త్వరితగతిని చిత్రం యెలా పూర్తవుతుంది. అందుకే చిత్ర నిర్మాణానికి కాలం అనేది అతి ప్రధానమైంది. కాల్‌షీటు ఉదయం 9 నుంచి సాయంత్రం 5 దాకా వుందనుకోండి. అందరూ ఆ టైమ్‌కే హాజరైతే అనుకున్న పని పూర్తి చేసేయ్యొచ్చు. కానీ యెవరైనా ఒక్కరు లేటుగా వచ్చినా స్టుడియోలో అదనపు కాల్‌షీట్ తీసుకోవాల్సిన అవసరం వస్తుంది. ఆపైన అందరికీ ఓ. టీ. లు. ఇలా ఒకదాని కొకటి రెట్టింపు అవుతూ పోతుంటే నిర్మాణపు ఖర్చును యెవరు ఆపగలరు? యిలాంటివాటిని ముందు ఆపగలిగితే, నిర్మాణపు ఖర్చు యింత అవుతుందని చెప్పొచ్చు. ఒక ప్రభుత్వ కార్యాలయంలో పనిచేసే ఉద్యోగిలా

అక్కినేనిని అభినందిస్తున్న శ్రీనివాస్, సిద్దేష్ (కర్నూలు), శేషాద్రి. మనుమడు చి. సుమంత్



యిక్కడ పనిచేసే ప్రతి ఒక్కరూ తమ బాధ్యతను గుర్తించి పని చెయ్యగలిగితే నిర్మాణపు ఖర్చు ఎంత అవుతుందో ఒకవిధంగా చెప్పొచ్చు.

### వెయ్యి చిత్రాలు వేయాలనుంది

'ఆర్టిస్టుగా మీ జీవితాశయం ఏమిటి ? దర్శకురాలిగా మీ ఆలోచనలేమిటి?' అన్న ప్రశ్నకు—

"ఆర్టిస్టుకు ఎన్ని చిత్రాల్లో నటించినా యింకా యింకా నటించాలనిపిస్తూనే వుంటుంది. ఆ కోరికకు అంతువుండదు. ఇక దర్శకురాలిగా నా ఆశయం ఒక్కటే. వంద చిత్రాలకు పైగా యాక్ట్ చేసాను నేను. ఓ యాభై చిత్రాలనైనా నేను రిటైర్ అయ్యేలోపు డైరెక్ట్ చేయాలని నా ఆశ. అది యెంతవరకూ నెరవేరుతుందో మరి." అంది విజయనిర్మల.

అత్యంత ఆదరాభిమానాలతో తనను అభిమానించి ప్రేమిస్తున్న ప్రేక్షకకోటికి పత్రికాముఖంగా తన కృతజ్ఞతలు తెల్పమంటూ ముగించింది. *

### శ్రీధర్‌కి మంచిరోజులు

"ముత్యాలముగ్గు" వర్ణ చిత్రం అద్వితీయ విజయాన్ని సాధించడం యెంత నిజమో, ఆ చిత్ర నాయకుడు శ్రీధర్ వేల్యూ కూడా అంతగా పెరిగిన నిజాన్ని అందరూ అంగీకరించగలరు.

ప్రముఖ దర్శకుడు శ్రీధర్ రూపొందిస్తున్న సి. పిచ్చిరెడ్డిగారి "సీత గీత దాటితే" చిత్రంలో నటుడు శ్రీధర్‌కు టిపికల్ వేషం లభించింది. ఆ పాత్రలో శ్రీధర్ చక్కగా చేశాడు అని ప్రేక్షకులు ఒప్పుకుంటారు. డిశంబర్ 31 నుంచి శ్రీధర్‌కు బెటర్ డేస్ అని ధైర్యంగా వ్రాయడానికి కారణం లేకపోలేదు. దర్శకుడు శ్రీధర్‌గారి శిక్షణలో నటించిన వాళ్లందరూ ప్రముఖులుగా ప్రకాశిస్తున్నారు గాబట్టి, ఆయనకు నటుడి భవిష్యత్తును పెంచే ట్రిక్కు తెలుసు గాబట్టి, నటుడు శ్రీధర్ విరాఘాటంగా నిలబడడం తథ్యం.



'రంభ—ఊర్వశి—మేనక'లో హలం



'బంగారక్క'లో నిర్మల, శ్రీదేవి

### సీతగా కవిత

పి. పి. ఆర్. ప్రొడక్షన్స్ నిర్మించిన "సీత గీత దాటితే" చిత్రం స్త్రీ లోకాన్ని మాత్రమే గాక యువతరాన్ని, ఆ తరాన్నికూడా ఆకట్టుకునే కథా వస్తువును గొనియున్నది. ఈ చిత్రంలో "సీత"గా కొత్త నటి కవిత గొప్పగా నటించింది. ఆమెకు ఘనతను తెచ్చిపెట్టే యీ తొలి చిత్రం, తెలుగు రంగంలో సుస్థిర స్థానానికి దోహదం చేస్తుంది.

సీత గీత దాటకపోతే రామాయణం లేదు. ఈ రోజుల్లోకూడా యెందరో సీతమ్మతల్లులు వున్నారు. వాళ్ళు గీత దాటితే జరిగేది ఏమిటి ? అనేడి సమస్యకు పరిష్కారం యిస్తుంది "సీత గీత దాటితే" చిత్రం.

దక్షిణ భారతదేశం గర్వించదగ్గ దర్శకమణుల్లో శ్రీధర్ ఒకరు. ఆయన దర్శకత్వంలో వచ్చిన "పెళ్లికానుక" చిత్రం యిప్పటికీ గుర్తున్నట్టే, సి. పి. ఆర్. ప్రొడక్షన్స్ వారి "సీత గీత దాటితే" చిత్రం కలకాలం జ్ఞాపకంగా వుండిపోతుంది.

"సీత గీత దాటితే" చిత్రానికి మహదేవన్ సంగీతాన్ని, ఆచార్య ఆత్రేయ సాహిత్యాన్ని, గణేష్‌పాత్రో సంభాషణాన్ని సమకూర్చారు. శ్రీ పూర్ణచంద్రరావు ఆధ్వర్యంలో నిర్మితమై, లక్ష్మి ఫిలింస్ ద్వారా విడుదలయ్యే యీ చిత్రంలో భవానీ, నిర్మల, విజయరాజా, చక్రపాణి, రావికొండలరావు, సాక్షిరంగారావు, హేమసుందర్, వై. విజయ సహాయ పాత్రధారులు.

### రెడ్డిగారి పల్లెసీమ

స్వయంకృషితో పైకొచ్చిన పి. చంద్రశేఖర రెడ్డి ఆంధ్ర ప్రేక్షకులకు అందిస్తున్న మరొక రతనమే శ్రీ దేవి ఆర్ట్ పిక్చర్స్ వారి "పల్లెసీమ" చిత్రం.

"పల్లెసీమలే మన భాగ్యసీమరా" అనేడి నిజాన్ని తన కథగా తీసుకుని, సజీవ సంఘటనలను విభిన్న పాత్రల ద్వారా వెల్లడించారు, దర్శకుడు చంద్రశేఖరరెడ్డి.

గ్రామ కాపురస్తుల జీవిత సత్యాల సమగ్ర స్వరూపమే "పల్లెసీమ" చిత్రం.

### జయప్రియ !

జయసుధ ... సత్యప్రియ ప్రధాన పాత్రలను పోషించిన "పల్లెసీమ" చిత్రం జనప్రియ కాగల అర్హతను పొందియున్నది. ఈ చిత్రానికి మహదేవన్ సమకూర్చిన సంగీతం యెంత గర్వంగా ఆనందించగలమో, మోదుకూరి జాన్సన్ వ్రాసిన మాటలు అంత కీర్తిని ఆర్జించగలవు.

ఈ చిత్రంలో గుమ్మడి, ప్రభాకరరెడ్డి, పద్మనాభం, అల్లురామలింగయ్య, మిక్కిలినేని, శ్రీధర్, కె. విజయ సహాయ పాత్రలను పోషించారు.

విలేజ్ సబ్జక్టును విజయవంతంగా రూపొందించగల ప్రజ్ఞ పి. చంద్రశేఖరరెడ్డికి వుందని ఎన్నోసార్లు ఋజువైంది. "పల్లెసీమ" చిత్ర నిర్మాతలు వరంధామిరెడ్డి, బలరామిరెడ్డిగార్లకు విజయం తథ్యం. అన్నపూర్ణ విడుదల.

### నన్ను ప్రేమించు

కన్నడ చిత్ర రంగంలో ఎనలేని ఖ్యాతి గడించిన పుట్టన్నకనగల్ దర్శకత్వంలో ఓ తెలుగు చిత్రం రూపు దిద్దుకుంటోంది. బీజాపూర్ పాలస్ (కర్ణాటక)లో ప్రారంభమైన యీ చిత్రం పేరు "నన్ను ప్రేమించు." ఒకే షెడ్యూల్లో, ఒక్క నెల్లో చిత్రం పూర్తయ్యేట్టు ప్లాన్ చేశారు యీ చిత్ర నిర్మాత కె. యస్. రామారావు.

శుభ (తెలుగు), ఆరతి (కన్నడ) అరుణా యిరానీ (హిందీ) ముఖ్య భూమికలను పోషిస్తున్న "నన్ను ప్రేమించు" చిత్రంలో జగదీష్, విశాలి, పద్మ (క్రొత్తతారలు) సహాయ పాత్రలను ధరిస్తున్నారు.

నవంబర్‌లో ప్రారంభమైన పై చిత్రం డిశంబర్‌కు పూర్తవుతుంది. ఫిబ్రవరిలో యీ చిత్రాన్ని ఆంధ్రదేశమంతటా విడుదల చేయాలనుకుంటున్నారు నిర్మాత కె. యస్. రామారావు

— శ్రీనివాస్ ●

వారం రోజులు చూస్తాను — మీరు వచ్చే ఆదివారానికి రానప్పుడు... నేను రావడం మీ కిష్టం లేదని భావించి, ఈ లోకంలోంచే శాశ్వతంగా తప్పుకుంటాను —

తరువాత మీరు హాయిగా సుఖంగా ఉండండి.

నీ కన్న తల్లి,
సరస్వతి.

* * *

రాజమండ్రి,
23–8–76.

శ్రీవారికి సుశీల నమస్కారాలు చేసి రాసుకున్నది :

ఈ ఉత్తరం మీకు చేరేసరికి మీరు క్యాంప్ నించి వచ్చేసే ఉంటారు.

గతాన్ని మీకు కొంత గుర్తుచేసి వర్తమానం లోకి వస్తాను.

ఆనాడు పెళ్లిచూపులకి మీరు మా ఇంటికి వచ్చినపుడు నా అంతటి అదృష్టవంతురాలు ఈ లోకంలో ఉండదనుకున్నాను. మీరు నేను మీకు నచ్చినట్టు మీ అమ్మగారికి చెప్పినపుడే నా మనసుని మీకు సమర్పించుకున్నాను. ఆ మాటకొస్తే మా నాన్నగారు అంతకుముందే నన్ను మీకు పరిచయం చేసినప్పుడు మీ ఇంట అడుగుపెట్టే అదృష్టం నాకుంటుందో ఉండదో అని ఆందోళన కలిగింది. ఎలా అయితేనేం మీ అమ్మగారు "సరే" అన్నారు.

కాని ఒప్పందం అయినా, పెళ్లికి ముహూర్తం పెడతామంటే అగండాగండంటూ మీ అమ్మగారు జాప్యం చెయ్యడంతో నా మనసుని భయం ఆవహించింది, మీరు నాకు దక్కకుండాపోతారని — ఆ ఆలస్యానికి కారణం మీ అమ్మగారేనని తరువాత తెలిసింది.

ఆఖరి కెలాగయితేనేం పుస్తె కట్టేరు — మీ అమ్మ కట్టనిచ్చేరు.

వైవాహిక జీవితం గురించి నాకెన్నో ఊహ లుండేవి. ఎన్నో తియ్యని కలలు కన్నాను. మన ఇద్దరి జీవితమూ అనురాగపూరితంగా ఎంతో ఆనందంగా గడిచిపోతుందని అనుకున్నాను. కాని ఒక సంగతి తెలుసుకోలేకపోయేను. మీ మనో వాక్కాయ కర్మలని ఓ పంజరంలో రామచిలుకని బంధించినట్టు, బంధించి తన అదీనంలో ఉంచుకున్న వ్యక్తి మీ అమ్మ రూపంలో ఉందనీ, ఆమె ఆడించినట్టే మీరు ఆడగలరనీ —

కాని మీ ఇంట అడుగిడగానే ఆ సంగతి నేను గ్రహించేను. మీ అమ్మ మీ మనసులోని జాగానంతా ఆక్రమించుకొని పీఠం వేసుక కూర్చుందనీ, ఆ పీఠాన్ని పెళ్లగించడానికి ఆ బ్రహ్మదేవుడే దిగి రావాలని, నాకు పిసరంత చోటూ మిగల్చలేదనీ తెలుసుకున్నాను — నేను మీకు కేవలం ఆడదానినే కాని, మీ కష్టసుఖాలూ, మీ మానసిక భావాలూ, అనురాగాపేక్షలూ పంచుకొనే భార్యని కాననీ, అలా మీరు నన్ను చూడడంలేదనీ నాకు తట్టింది.

మీ కెప్పుడూ మీ ప్రాక్టీసూ, మీ అమ్మ. ఈ రెండూ ఉంటే చాలు. ఒక్కనాడూ మనసు విప్పి మీరు నాతో మాట్లాడలేదు. ఏదో జంకు, పిరికితనం, భయం! చిన్నపుడు ఆటలాడుకొనే టప్పుడు అనుకొనేవాళ్లం, "ఇంటికి వెళ్లిపోవాలి! అమ్మ కొంబడుతుంది!" అని. ఆ మనస్తత్వం

# క్రపెట్టెలో కళేబరాలు

(25 వ పేజీ తరువాయి)

అలానే మీకుండిపోయింది.

ఇంక మీ అమ్మ! మనం అనుకొనే ప్రతి మాటా, మనం చేసే ప్రతి పనీ గమనిస్తూ, ఎక్కడ మీ మనసుని ఆమెమీదకి తిప్పి విషపూరితం చేస్తానో అని అనుమానపడుతూ, దుబ్బుచాటు పులిలా ఉండేది. దాంతో ఆరంభమయింది మా మధ్య యుద్ధం — మొదట ప్రచ్ఛన్న యుద్ధం, తరువాత బహిరంగ యుద్ధంగా మారింది. నన్ను ఆమె అనే డెప్పిపొడుపుడు మాటలు, నాకు చేసిన అవమానాలూ మీకు చెప్పలేదు నేను — మీరు బాధపడతారని.

రాను రానూ మీకు నామీద ఏర్పడ్డ ఆ కాస్త ప్రేమానుబంధమూ సడలిపోయింది. మీ అమ్మ నన్ను అనే బాధాకరమైన మాటల గురించి మీకు చెప్పినా మీరు పెడచెవిని పెట్టేవారు—ఇంటి కోడలిని కనక అత్తగారి సాధింపులూ, మాటలూ నేను పడాలని మీ ఉద్దేశమో ఏమో ?

మూడుసార్లు పుట్టింటికి వెళ్లిపోయేను కొన్నాళ్ళ నే లేకపోతేనన్నా అత్తగారు మారుతుందని నేను మీకు దూరమవగానే ఎంతో ప్రేమగా ఉత్తరాలు రాస్తూ, రమ్మని ప్రాధేయపడేవారు — తీరా వచ్చేసరికి మంచుముక్కలా గడ్డ కట్టుక పోయేవారు.

రోజులు గడుస్తున్నకొద్దీ నా పరిస్థితి నరకంలా మారింది. ఇల్లొక యమలోకం అయింది. ఓసారి భరించలేక, విషం తాగి ఛస్తాను అని మీ అమ్మతో అన్నాను మీరు వింటూ ఉండగానే — ఛస్తానన్న వాళ్లెవరూ చావరు, చావడం సులభం కాదని మీ అమ్మ అంటే మీరు తల ఊపేరు.

నా భర్తయిన మీతో నేను కులాసాగా కబుర్లు చెప్పుకో వల్లకాదు — మీతో కలిసి సినిమాలకీ క్లబ్బులకీ వెళ్లడానికి వీలులేదు. హాయిగా నవ్వకూడదు. మనసు విప్పి పాడుకోకూడదు — మీకు ఏ సేవలూ నేను చెయ్యకూడదు — నేను అన్నం పెడితే అందులో విషం కలుపుతానని మీ అమ్మ భయం కామోసు.

నేనింక ఓర్చుకోలేను — మీరూ మీ అమ్మా కలిసి నన్ను పిచ్చిదానిగా మార్చేసేరు. వారం వరకూ రానని మీరు అరుకువ్యేలీ వెళ్లిపోయేరు కారు తీసుకొని. (అది నన్ను తప్పించుకొనేందుకు మీ ఎత్తు) — వెళ్లిన రెండో రోజున మీ అమ్మగారు చేసింది ప్రళయం.

* * *

ఆరోజు సుశీల వండలేదు — సోఫాలో పడుకుంది.

అత్తగారొచ్చి ఈసడింపుగా అంది : "వంటా పెంటా ఏమీ అక్కర్లేదా ? అలా పడుకున్నావ్ ? బెంగ పెట్టుకుంటున్నావా ?"

"నాకే బెంగా లేదు—మీకే అన్ని బెంగలూనూ. నేను వండకూడదని శాసించేరుగా ?"

"అబ్బాయి లేడుగా?" అందామె వెటకారంగా.

"అబ్బాయి లేరుకాబట్టే, అబ్బాయికోసం బెంగతో మంచంవేసారు కాబట్టే, నేను వండాలి — మీ అన్నంలో విషం కలుపుతానని మీకు భయంలేదా ?"

"నాకెందుకు పెడతావ్ విషం ? వాడికి పెడితే నీకు రెండు లాభాలు. వాడి పీడా, వాడిమీద బెంగతో నేపోతే నా పీడా నీకు విరగడౌతాయి." అందామె విసురుగా అక్కసంతా వెళ్లబోస్తూ.

సుశీల పులిలా ఆమె మీద కురికి ఆమె భుజాలు పట్టుక కుదుపుతూ అరిచింది — "నేనెవ్వరికీ పెట్టను విషం. నేనే తిని ఛస్తాను. నా మొగుడికి నేను విషం పెడతానంటారా ? అలా ఆలోచించడానికన్నా మీ కెటువంటి మనసిచ్చేడు దేవుడు ?"

సరస్వతి విదిలించుకొని అంది : "వేగం ఆ పని చెయ్యి...!"

* * *

నేనింక ఆవేశం ఆపుకోలేక అనవలసిన నాలుగూ అనేసేను.

ఈ యింట్లో ఆవిడకి స్థానం లేదని చెప్పేసేను. ఈ యిల్లు నాదీ, నా భర్తదీ అని చెప్పేసేను.

ఆమె వెంటనే అక్కసుకొద్దీ పెట్టే బేడా సర్దుకొని పుట్టింటికి వెళ్లిపోయింది. అంటే మీ మేనమామ యింటికి.

నాకేనా లేదు పుట్టిల్లు ? మర్నాడుదయం నేనూ పుట్టింటికి వచ్చేసేను.

ఈ ఉత్తరం మీకు, మీరు క్యాంప్ నించి తిరిగివచ్చిన రోజున అందుతుంది.

మీకు నేనే కావాలో, మీ అమ్మే కావాలో నిశ్చయించుకోండి. నేనే కావాల్సివస్తే మీరు స్వయంగా వచ్చి నన్ను తీసుకువెళ్లండి. మీ అమ్మని ఆమె అన్న దగ్గరే వుండనివ్వండి. మీ అమ్మే కావాలంటే ఆమె దగ్గరికే వెళ్లండి.

ఈ వుత్తరం మీకు మంగళవారానికి అందుతుంది. మరోరోజు ఆలస్యం కలుపుకున్నా బుధవారాని కందుతుంది. మరో రెండురోజులు మీకు వదుల్తున్నాను. మీరు శనివారానికల్లా నా అవసరం వుంటే నాదగ్గరి కొస్తారు. మరోరోజు కలిపి, ఆదివారానికల్లా మీరు యిక్కడికి రానపుడు నా అవసరం మీకు లేదని నిశ్చయానికొస్తాను.

ఆడది ఒక్కరికే మనసుని అర్పిస్తుంది అతడే భర్త అయినపుడు, ఆ భర్త ఆమెను విడనాడినప్పుడు ఆమె మరి బతకనవసరంలేదు.

నాదగ్గర ఓ చిన్న సీసాలో స్లీపింగ్ పిల్సున్నాయి. ఆదివారంనాడు మీరు రానప్పుడు సోమవారం ఉదయం నా శవాన్ని దహనం చెయ్యడానికన్నా రండి ! చస్తానికూడా రాసేసేను. అలా రాసేసినా మీరు రాకపోతే నేను చావక యెలా వుండగలను ? వుండి లాభం ఏమిటి ?

మీ — సుశీల.

* * *

అరుకులోయ
22–8–76

ప్రియమైన సుశీలకి,

ఇంట్లో ఇంక వుండడం దుర్భరమై యిక్కడ క్యాంప్ మిషతో యిక్కడి కొచ్చేసేను.

నా కప్పు డప్పు డనిపిస్తూ వుంటుంది దేవుడు మనిషికి రెండు శరీరాలిస్తే బాగుణ్ణని. అప్పుడు ఒకటి నీకు, ఒకటి అమ్మకి యిచ్చివుండును.

నేను నిన్నెంతగా ప్రేమిస్తున్నానో నువ్వు

[illegible] అందరిలాగా బోళాగా నీముందు ప్రదర్శించే చాకచక్యం నాకు తక్కువ నా మనసులోని భావాలని సరిగా నీముందు పెట్టలేకపోయేను ఏనాడూ నిన్ను ఎంతోగా ప్రేమిస్తున్నానని దండోరా కొట్టుక తిరిగే తత్వం నాకు లేదు నువ్వు నా మనసుని అర్థం చేసుకుంటా వనుకున్నాను కాని నువ్వు నన్నపార్థం చేసుకున్నావు నా మనస్సులో అమ్మకి తప్ప మరెవ్వరికీ స్థానం లేదనుకున్నావు

మనసుకి ఎల్లలు లేవని నీకు తెలీదా సుశీలా ? అది ఆదిమధ్యాంతరహితమైనది. అది విశ్వాన్నంతటినీ ఇముడ్చుకోగలదు అటువంటిది యీ నా మనస్సు అమ్మనీ, నిన్నేకాక ప్రపంచంలోని ప్రతి ఒక్క జీవినీ ప్రేమించగలదు నీకు నా మనసులో చోటు లేకపోవడమేమిటి ? !

అమ్మకూడా పొరపడింది — నీలానే అనుకుంది కాని దిద్దుకోలేని పొరపాటు కాదది — అమ్మ అర్థం చేసుకోగలదు కాలక్రమేణా

కొడుకు తల్లికి సర్వస్వమూ కాదని ఎవరన గలరు సుశీలా ? దేవుడుకూడా అనలేడు ఇంక అమ్మ నాగురించి అంత ఆత్మీయత కనవరచడానికి అమ్మపట్ల సానుభూతికీ ప్రేమకీ కారణం నీకు తెలుసుకదా ?

ఆనాటి అమ్మ నాకెప్పుడూ గుర్తొకొస్తుంది ఎంత మంచిది అమ్మ ! యెంత బాగుండేది అమ్మ ! తల దువ్వినా, అన్నం కలిపి తినిపించినా, నా కళ్లలోకి నవ్వుతూ చూసినా, "బాబూ ! రామూ !" అని పిలిచినా, ఎవరో స్వర్గంలోంచి దేవత దిగివచ్చి నన్ను స్వహస్తాలతో పెంచు తున్నట్టనిపించేది

ఎలా మరిచిపోగలను, అమ్మ జీవితం మోడువారిన ఆ సాయంత్రం ! నాన్నా అమ్మలతో కలిసి సినిమాకి వెళ్లవల్సింది, నాన్న శవంతో స్మశానానికి వెళ్లేను నాన్నకోసం బెంగతో చిక్కి, శల్యమై కొనవూపిరితో వుండి, ఏ క్షణం అన్నా నాన్నని వెతుక్కొనిపోటోయేలా తయారైన అమ్మని "వదిలి పోకమ్మా !" అని ఏడుస్తూ వాటేసుకొనే వాడిని

అమ్మ నాకోసమనే బతికింది — బతుకునంతా నాకోసం ధారపోసింది ఆటువంటి అమ్మని యెలా దూరం చేసుకోగలను ?

మీ యిద్దరూ అన్యోన్యంగా వుంటారనీ, మీ ఇద్దరి అనురాగం, ప్రేమ నాకు దొరుకుతాయని, మన యిల్లు స్వర్గమే ఔతుందనీ అనుకున్నాను కాని నాకు దొరికినది అశాంతి మాత్రమే ! ఇల్లొక నరకంగా తయారయింది

దీని కొకటే పరిష్కారమార్గం ! మీ ఇద్దరూ చల్లటి వెన్నెలలు కురిపించినప్పుడే యింట్లో వుండగలను సూర్యగోళంలా భగ్గున మంటలు మండుతే నేను వాటిలో బుగ్గవక తప్పదు

ఈ వుత్తరం నీకు బుధవారాని కందుతుంది యెంత ఆలస్యమయినా ఈ వుత్తరం నువ్వు చదివేక అమ్మకి చూపించు మీ యిద్దరూ మీ

# క్రరపెట్టెలో కళేబరాలు

వైషమ్యాలూ, కోపతాపాలూ త్యజించి, ప్రేమ భావం అలవరచుకుందుకు నిశ్చయించుకుంటారని ఆశిస్తున్నాను.

నా ఆశ మీరు నిజం చేసినట్టయినా మీ యిద్దరూ కలిసి నాకు వుత్తరం రాయండి . మరి మన యింట కలతలూ, కక్షలూ, కావేశాలూ వుండవు కలిసికట్టుగా, హాయిగా వుందాం . వెంటనే వచ్చిమని యిద్దరూ సంతకంపెట్టి నా కుత్తరం రాయండి !

శనివారం నాటికి నాకు జవాబు రావాలి మీనించి.

ఆ జవాబు వచ్చేవరకూ యీ ఊళ్లోనే వుంటాను ఇక్కడ ఇన్స్పెక్షన్ బంగళాలో వుంటున్నాను ఆ అడ్రస్‌కి రాయండి రిజిష్టర్డ్ పోస్ట్ ద్వారా పంపండి ఉత్తరం పోకుండా — లేదా రెండు ఉత్తరాలు రాయండి — ఒకటి తప్పిపోయినా ఒకటి అందుతుంది ఈ వుత్తరం రెండు కాపీలు తీసి రెండు కవర్లలో పోస్ట్ చేస్తున్నాను — ఒకటి తప్పిపోయినా ఒకటైనా అందుతుంది

సోమవారం ఉదయం వరకూ చూస్తాను

సోమవారానికి నాకు జవాబు రానప్పుడు... సరే మంగళవారం బుధవారంకూడా వెయిట్‌చేస్తాను ఆనాటికీ జవాబు రాకపోతే

బీరువాలో వుంది ఏభైవేల జీవితభీమా కాగితం — ఏక్సిడెంట్ వల్ల నేను చచ్చిపోతే అక్షరూపాయె లొస్తుంది సగం నీది — సగం అమ్మది. అది కాకుండా ఇల్లు కూడా సగం నీది. సగం అమ్మది బ్యాంక్‌లో పాతికవేలు రొక్కం వుంది అదికూడా పంచుకోండి

లక్ష్మివారం ఉదయం, యస్ కోటకి వెళ్లే దారిలో ఘాట్ చరియలలోకి ప్రమాదవశాత్తూ నేను కారుతోసహా దొర్లుకపోయినట్టు వార్త అందుతుంది నీకు నా శరీరం గుర్తుపట్టడం కష్టం అవొచ్చు — కాని నువ్వూ అమ్మా గుర్తు పట్టగలరుకదా ?

ఈ సంగతి తెలిసాకకూడా మీరు మీ పొరపొచ్చాలు మానుకొని నాకు ఉత్తరం రాయకపోతే నేను బతికుండి ఎవరిని ఉద్ధరించను? మీ ఇద్దరూ శృంగవరపు కోట బస్సులో ఉత్తరం అందిన వెంటనే వస్తే అంతకన్న నాకు కావల్సిందేమిటి !

ఇట్లు,
"వి — రావ్"

## 2

విశాఖపట్నం, మహారాణీపేటలో, సముద్రం కనిపిస్తూవుండగా, ఆ వీధిలో అధునాతనంగా కట్టుకున్న రెండతస్తుల ఇల్లది ఇంటి చుట్టూ ఆవరణ. ఆవరణలో పూలతోట — ఎన్నోరకాల పువ్వులు

చుట్టూ కాంపౌండు గోడ—దానికో ఆరడుగుల ఇనప గేటు గేటుకో తాళంకప్ప వుంది. ఇంటికో తాళంకప్ప పడివుంది. ఇంట్లో యెవ్వరూ లేరని తెలుస్తూవుంది

ఇనప గేటుకి తగల్చబడ్డ "లెటర్ బాక్స్" అని ఆంగ్లంలో తెల్లటి అక్షరాలతో వున్న నేరేడు రంగు క్రరపెట్టెకి చిన్న మిల్లర్ తాళం పడివుంది

పగలు పది గంటలయింది వీధిలో సందడి లేదు ఆరోజు మంగళవారం — (24-8-76) స్కూళ్ళూ, కాలేజీలూ, ఆఫీసులూ వుండడంవల్ల ఎక్కడికి వెళ్లవల్సినవారక్కడికి వెళ్లేరు

పోస్ట్‌మాన్‌కూడా తన డ్యూటీ చేసుకుందుకని ఆ వీధికొచ్చి, డాక్టర్ వి రామారావ్, ఎం డి అని ఆంగ్లంలో నేమ్ ప్లేట్ కాంపౌండు గోడకున్న ఆ యింటిముందు సైకిలాపి దిగేడు నిలబడి, ఇంటికేసి ఆశ్చర్యంగా చూసేడు

ఆలోచిస్తూనే, సైకిల్ క్యారియర్ నించి ఉత్తరాల కట్ట తీసి, అందులోంచి నాలుగు కవర్లు ఎంచి తీసి, ఇనపగేటు కున్న క్రరపెట్టెలో వాటిని వేసి, మరోసారి ఇంటికేసి చూసి, పెదవులోసారి విరిచి, సైకిలెక్కి ముందుకు పోయేడు అక్కడున్న ఏ ఇళ్ళకీ ఉత్తరాలు లేకపోవడంవల్ల

పైన ఉదహరించిన మూడు వుత్తరాలూ, ఒక వుత్తరం యొక్క ఎక్స్‌ట్రా కాపీ ఉత్తరం, వెరసి నాలుగు ఉత్తరాలూ, గోరీలలోకి కళేబరాలు వెళ్లినట్టు, ఆ క్రరపెట్టెలోకి, ఆ చీకటికోణాల నిశ్శబ్దతలోకి జారిపోయేయి !



'దేవుడున్నాడు జాగ్రత్త'లో రంగనాథ్, సుమిత్ర



## మావూరే ఒక సమస్య

మావూరు ఏదో చెప్పటానికి ముందు మీకు కొన్ని "క్లూ" లిస్తాను...మీరు ఏ మాత్రం లోకానుభవం వున్నవాళ్ళైనా మా వూరేదో చెప్పగలుగుతారు...

రోడ్డు మధ్యన సాయంకాలపు ట్రాఫిక్ హోరును లక్ష్యపెట్టకుండా పుంగవులు నడుచు పట్టణం మాది...ఒకవేళ యెవరైనా రోడ్డుకు కొంచెం వారగా నడుస్తూ వుంటే వాళ్ళు రోడ్డు మధ్యకి వున్నాడనికో, లేక పోతే కాలుతున్న సిగరెట్‌ను అలాగే ఆర్పకుండా పారేయడానికో రోడ్డు మధ్యగా వెళ్ళారన్నమాట!

సైకిళ్ళను సెంటర్లలో నిలబెట్టి వాటి మీద కూర్చొని ఆ ప్రక్కనే నలుగురు నిలబడి, కబుర్లు చెప్పుకుంటు న్నారూ అంటే యీ దృశ్యం నిత్య నూతనంగా వర్ధిల్లేదైతే అది తెలుగు వూళ్ళల్లో ఏదైన వుంటుంది...?

ఇరవై నాలుగ్గంటలూ, రైళ్ళూ, బస్సులూ అన్ని దిక్కులనుంచి వచ్చి ఆగుతూ, రిక్షాల గంటల చప్పుళ్ళతో లారీల రొదతో "రాత్రెరుగ"ని తెలుగు మహానగరం మాది... 'నిద్ర ఎరుగని' ప్రాచీన పట్టణం ఏది?

ఇక్కడ పరిశుభ్రతమీద అల్టిమేట్ అధారిటీ శానిటరీ యినస్పెక్టర్. కిళ్ళీకొట్లు, టీ, సమోసా కొట్లు, బడ్డీకొట్లు లాంటి వాటికి డ్రయినేజి సౌకర్యం, అక్కర్లేకుండా సెంటర్లలో వాళ్ళు వాడే ఎంగిలి నీళ్ళన్నీ చిన్న ఏరులై నిత్యం పారడానికి అవకాశం ఎవరిస్తారు? "పర్మిషన్‌తోనే పెట్టుకున్నాం సార్ మా దుకాణాలు. యిన్‌స్పెక్టర్‌గారి నడగండి" అంటే 'టీ బంకర్' అర్థం యే యిన్‌స్పెక్టర్ ?

మహారణ రణరంగంలా వుండే విడిచి పెట్టిన రెండు సినిమాహాళ్ళ మధ్య, అక్కడి కక్కడ మొలిచిన చిన్న తెల్లని కొండల్లాగ గోమాతలు. 'బజ్జో'ని ఉదయంనుంచి తిన్న ఆకూ అలమూ, కూరా నారా నెమరేస్తూ వుంటే, నాలుగు చక్రాల రెస్టారెంట్‌లు "రోరింగ్ బిజినెస్" చేస్తూ వుంటే, యివన్నీ వట్టని వేదాంతుల్లాగా కబుర్లు చెప్పుకుంటూ సెంటర్లలో నిలబడే కానిస్టేబిల్స్ వున్న వూరు మరేదై వుంటుంది ? మీరిపాటికే అనుకుంటున్నదే...

రద్దీగా వుండే రోడ్లమీద పెరిలిన్ గుడ్డల దగ్గర్నించి, నిరోధ్‌లు దాకా మీ భవిష్యత్ దగ్గర్నించి మీరు మరిచిపోయిన గతంలోని "సెక్సు గ్రంథాగారం" దాకా [illegible] వూరేది? ఈ పుట్‌పాత్‌లమీద అల్టిమేట్ అధారిటీ ఎవ్వరు? "ట్రాఫిక్ కానిస్టేబుల్"

ట్రాఫిక్, సానిటరీ స్టాఫ్‌లలో అల్టిమేట్ అధారిటీలను ప్రక్షాళనం చేస్తే తప్ప బాగు పడని మహానగరం.

అలా చేయటం యింతవరకూ సాధ్యంగాని మహానగరం- రైల్వే జంక్షన్–బస్‌ల జంక్షన్ వీధి వీధికీ లాడ్జింగులూ, సెక్స్ స్పెషలిస్టులూ విరాజిల్లే మహానగరం యేది ? "డస్ట్ బిన్‌లు" లేని వీధులుగల గొప్ప వూరు, పొల్చే వుంటారు...దాని పేరు యీపాటికి. అదే బెజవాడ! దాన్ని విజయవాడగా మార్చినా కూడా అదింత పిసరు "కేర్" చేయలేదు. "పేరు మారినా వూరు మారునా?" అని పాడుతోంది !

"రోజా వూళ్ళో వుండే జనాలైతే ఎలాగైనా నేర్పుతాం యింటింటికి కరపత్రాలేస్తాం కాని యీ వూర్లో తిరుగాడి యీ గాలి వెల్తురూ, సుఖం, దుఃఖం, మౌనం, గానం అన్నీ మేసే జనాభా మన గ్రామీణ సంతతి...వీళ్ళకి ఏ రూల్సు పెట్టినా ఎప్పటి కప్పుడు వరగడుపే..." అంటారు అధికారులు... "మా వూరి సమస్య" అన్న హెడ్డింగు క్రింద విజయవాడలో సమస్యలు రాద్దామా? అని అనుకుంటే వెంటనే "అసలు విజయవాడే ఒక సమస్య"అనిపిస్తుంది ఎక్స్‌పర్ట్‌లకి–సో! సేవ్ మై టవున్ ఓ మై గాడ్ !!

[ వీరాజీ ]


పద్మశ్రీ నటరత్న యన్.టి.రామారావు సమర్పించు శ్రీరామకృష్ణ చిత్ర వారి
మంచికి మరోపేరు
ఈస్ట్‌మన్ కలర్
దర్శకత్వం:
సి.యస్.రావు బి.ఎ.(లిట్)
నిర్మాత:
యం. మనోహర్ ఎం.ఎ
alpana
VIJAYA

# వారఫలం

మహేష్

17-12-1976 శుక్రవారం మొదలు
23-12-1976 గురువారం వరకు

**మేషం:** నూతన వ్యవహారాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. వారం మధ్యలో మీ మాటలకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. ప్రయాణ కలుగుతుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు —కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం జరుగుతుంది.

**వృషభం:-** మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. పోటీదారులతో వాదప్రతివాదాలుతగవు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు. వారం ఆఖరులో లాభం రానంత వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**మిథునం:-** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమకలుగుతుంది. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు. ప్రయోజనంగల సంభాషణలు జరుపగలరు. స్త్రీలకు —కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కర్కాటకం:-** ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. పోటీదారులలో గౌరవం లభిస్తుంది. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. వారం ఆఖరులో మీరు అనుకునేదొకటి జరిగేది మరొకటి కావచ్చును. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**సింహం —** వ్యాపారంలో పోటీదారి పోటీ తగ్గుతుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. మీ మంచి మనసే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు —బంధుమిత్రులను కల్సుకొంటారు. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కన్య:—** మీ శ్రమకుతగిన ఫలితం లభిస్తుంది. ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. వారం ఆఖరులో హడావుడి అధికంగా ఉంటుంది. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**తుల:—** మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

వృత్తిలో ఆదాయం బాగుంటుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం:** సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో వివాహ కార్యక్రమాలు బాగుంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. సాహిత్య కళారంగాల్లో విశేష కృషి రాణించగలదు. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**ధనుస్సు :—** వృత్తిలో విశేష ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో విలువైన వస్తువులు పోవచ్చును. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో అనుకూల పరిస్థితి ఏర్పడగలదు. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. సంతానానికి సౌఖ్య సంపదలు లభిస్తాయి.

**మకరం:—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో చేతి కొచ్చిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

**కుంభం :—** వృత్తి వ్యాపారాలు అనుకూలంగా వుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ముందుముందు ఉపయోగించగల వ్యక్తులను కల్సుకొంటారు. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు — దైవకార్యాలు నెరవేరతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం :—** ఫలితంలేని శ్రమ కలుగుతుంది. వ్యాపారంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం మధ్యలో అనుకూల పరిస్థితి ఏర్పడుతుంది. సంతోషకరమైన వార్తలను వింటారు. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ●

## రాలిన ముత్యాలు

*......శ్రీ సోమసుందర్......*

దవానల శిఖలను ఉమిసింది అడవి
బడబాగ్ని బుసలు కక్కింది కడలి
భారత మొక అనారత దీపదీప్తి
శారద నభమై మెరిసిన రవిదీప్తి!




## జైలర్ ముందు నుంచున్నాడు రామకృష్ణ.

అతని కళ్ళు ఎర్రగా వున్నాయ్. గడ్డం మాసింది. తల మాసి పోయింది. ముఖంలో నరాలన్నీ బిగుసుకుని వున్నాయ్.

"రామకృష్ణా ! నిన్ను యీ రోజు విడుదల చేస్తున్నాము."

జైలర్ మాటలు అతనిలో ఆనందాన్ని కలిగించలేదు. ఒక విధంగా నిరాశనే సృష్టించాయి.

"చూడు కృష్ణా, నీవు చాలా మంచి వాడివి. నా ఇన్నేళ్ళ అనుభవంలో నీ లాటి ఖైదీని చూడలేదు. నీ మంచితనానికి ఎంతో జైలు శిక్ష తగ్గిపోయింది. ఒకనెల ముందుగా విడుదల చేస్తున్నాం."

'థాంక్స్' అనలేదు అతను.

"నీ ఫయిల్ తెప్పించి చూశాను మొదటి నుంచీ. నీపై పాత జయిలర్ల రిమార్కులూ చూశాను. మరో విషయం చెప్పనా? నీదీ నాదీ ఒకేవూరు. చిత్రం కదూ! ఖైదీదీ జయిలర్‌దీ ఒకే వూరు" నవ్వాడు జయిలర్.

రామకృష్ణ నవ్వలేదు.

"నీ కేసు అంతా నాకు తెలుసు. నిజానికి నీవు పరంధామయ్యగారిపై హత్యా ప్రయత్నం చేయలేదు. ఆ యింట్లో దొంగతనం చేయలేదు. అడ్డువచ్చిన వాచ్‌మన్‌ని హత్య చేయలేదు" జయిలర్ ఆగాడు.

పాత గాథలు తవ్వినందుకు రామకృష్ణ ముఖం జేవురించింది. అతనేదో అనబోయాడు.

"అవును రామకృష్ణా! నాకంతా తెలుసు. నీవు ఆయన పర్సనల్ సెక్రటరీగా పని చేసేవాడివి. నిన్ను వాళ్ళమ్మాయి రాధ మనసారా ప్రేమించింది. వాళ్ళ నాన్నగారు పెళ్ళికి అంగీకరించకపోతే నీతో లేచి రావటానికి కూడా సిద్ధమయింది. కానీ నీవు అందుకు సిద్ధంగా లేవు. అయితే పరంధామయ్యగారికిదంతా తెలీదు. తన కూతుర్ని నీవు మోసపుచ్చుతున్నావనే భావించాడు. ప్లాన్ వేశాడు. చిలక చిక్కింది. కోర్టులో నేరం ఋజువైంది. నీవు జెయిల్ పాలయ్యావు. పదేళ్ళు శిక్ష పడింది."

"సార్! దయచేసి నా డ్రస్ యివ్వండి. గతంలో నాకు నిమిత్తం లేదు. నే నదంతా మరిచిపోయాను. నాకు పరంధామయ్యగారిపైగానీ, అడ్వొకేట్ శివమూర్తిపై కానీ కోపం లేదు. ఇదంతా నా ప్రారబ్ధం. అనుభవించాను. అంతే!"

ఆ మాటలికి ముగ్ధుడయ్యాడు జైలర్ జగన్నాథం. "అదిగో! ఆ గుణమే నన్ను మురిపించింది. ఇక ఆవేశాన్ని అణుచుకో. శాంతిగా బతకటం అలవాటు చేసుకో. ఇవిగో నీ డబ్బులు. ఇది నీ డ్రస్. నీవు మంచిగా ఉద్యోగం చేసుకుంటావనే వుద్దేశ్యంతో ఓ ఫ్యాక్టరీ యజమానికి వుత్తరం రాసిస్తున్నాను తీసుకో. నన్ను మెప్పించిన నీవు అతన్ని

మెప్పించటం కష్టం కాదు. వెళ్ళు. విష్ యు బెస్ట్ ఆఫ్ లక్.''

తిరుగుతున్న కళ్లని రెప్పల మధ్యే ఆపేడు రామకృష్ణ.

జయిలర్ గారిచ్చినవి అందుకుని బయటికి వచ్చేడతను.

*　　*　　*

గుండెనిండా స్వేచ్ఛావాయువుల్ని పీల్చుకున్నాడు రామకృష్ణ.

''స్వతంత్ర భారతదేశంలో తానూ ఒక స్వతంత్రుడు ! తానిప్పుడు నేరస్థుడు కాడు. నలుగురిలాగా తనూ బ్రతకొచ్చు...నలుగురిలా తలెత్తుకుని తిరగొచ్చు...''

మారిపోయిన వూరుని చూసి 'కాలం ఎంత త్వరగా మార్పు తెస్తుంది' అనుకున్నాడు. ఎదురుగావున్న సెలూన్‌కి వెళ్ళి శుభ్రంగా తయారయ్యాడు. పక్కనే వున్న హోటలుకు వెళ్ళి నాలుగుబకెట్ల వేడినీళ్ళు స్నానంచేశాడు. కడుపునిండా భోజనం చేశాడు.

అప్పుడు మళ్ళీ ఆతనికి ఓ ప్రశ్న ఎదురైంది. ఎక్కడికి వెళ్ళాలి ? అతనికి తన వూరుకి వెళ్లటం యిష్టంలేదు ! అయినా అక్కడికివెళ్ళి ఏం చేయాలి ? అక్కడెవరున్నారు ? వృద్ధురాలైన తల్లి తనజైలు శిక్ష వినగానే గుండె ఆగి మరణించింది. ఒక్క చెల్లెలు— చెల్లెలు మాట తలచుకోగానే అతనిగుండె బరువెక్కింది.

''దిక్కు మొక్కులేని చెల్లెలు స్థితి ఎంత అధ్వాన్నంగా మారాలో అంత అధ్వాన్నంగానూ అయిపోయింది. కుక్కలు చింపిన విస్తరిలాంటి జీవితంతో ఆవూళ్ళో వుండలేక చెడి చెన్నపట్నం చేరు అన్న సామెతని నమ్ముకుని వెళ్ళింది. అక్కడ ఎక్కడుందో ! అసలుందో లేదో కూడా తెలీదు. ఇక తనవూరిలో తనకేముంది.

ఇక్కడే వుండి పోవటానికి యీ వాతావరణం తనకి జైలు వాసనే కొడుతూ వుంటుంది. తనూ జైలువాసనే కొడుతాడు. లాభంలేదు. ఇక్కడ తను బ్రతుకుని సాగదీయలేడు.''

అప్పుడు గుర్తుకొచ్చింది జగన్నాథంగారు చెప్పినమాట. అన్నట్టు ఆయన వుత్తరం రాసిచ్చాడుగా. ''ఎవరో ! ఏవూరో ?'' అనుకుని అడ్రస్ చూశారు. ''రామారావు,సుజాతా పబ్లిసైజింగ్ కంపెనీ'' అన్న అడ్రసుచూసి ''ఆ వూరైతే ఫర్వాలేదు అటు తనవూరికి ఇటు యీవూరికీమధ్యస్థంగావుంది.తనగతాన్ని కప్పెడుతుంది'' అనుకున్నాడు తను. అతన్ని వెళ్ళి చూడాలని నిర్ణయించుకున్నాడు. అనుకున్నది తడవుగా యింకెందుకు ఆలశించాలి ? అనుకుని బస్సెక్కాడతను.

*　　*　　*

బస్టాండులో బస్సుదిగి నడవసాగాడు రామకృష్ణ. కొద్దిదూరం నడవగానే ఓ గుడి కన్పించింది. అలసటగా వున్న శరీరానికి గుడి కంటే పదిలమైంది ప్రస్తుతానికి లేదు అనుకుంటూ గుడివైపు నడిచాడతను.

భార్యా సమేత శ్రీకృష్ణమూర్తి గుడి అది. స్వామిని చూసి అప్రయత్నంగా నమస్కరించాడతను. 'స్వామి ! ఈజైలు శిక్షకి పూర్వం నాలంత ఆస్తికుడులేడు ! ప్రతిరోజూ రెండు సంధ్యల్లో నీ దర్శనం చేసుకొంది ఏపనీ చేసే వాడినికాదు. వేణుగోపాలస్వామికి విన్నవించుకోంది ఏపనీ తలపెట్టేదికాదు మాతల్లి.మాల అల్లి నిన్ను పూజించింది మాచెల్లి. ప్రతిఫలంగా మా జీవితాలు కడగండ్ల పాలయ్యాయి. నన్ను నమ్మినవారిని బాధపెట్టి నా భక్తుల్నిగా మార్చుకుంటాను నేను అన్నట్టు నీవు. కానీ నీ యాసిడ్ టెస్ట్ కి మేము ఆగలేకపోయాము. పుట్టకొకరు చెట్టుకొకరుగా చెల్లాచెదరై పోయాం మేము. ఈ నా జైలు జీవితంలో నీవు గుర్తే రాలేదు. తిరిగి సాంఘిక వాతావరణంలో బ్రతకటానికి వచ్చాను నేను. తొలుత నీదర్శనమే అబ్బుతోంది అప్రయత్నంగా. మారిన జీవితంతో పాటు మారిన అభిప్రాయాల్ని మారుస్తావో— అలాగే నిలుపుతావో నీదే భారం''

మండపంలో బాగా విశ్రాంతి తీసుకుని కాస్త చల్లబడ్డాక తిరిగి దేవుడికి దండం పెట్టుకుని రామారావుగారిని చూడాలని బయల్దేరాడు రామకృష్ణ. అతనిలో అన్నీ ఆలోచనలే!

సుజాతా పబ్లిసైజింగ్ కంపెనీ అన్న బోర్డుని చూసి ఆగేడు రామకృష్ణ. గేటు ముందు ఆగిన ఆ ఒక్క క్షణంలో అతనిలో ఎన్నో ఆలోచనలు దొర్లాయి. వాటినన్నిటిని అణుచుకుని గేటు తీసుకుని పోబోయాడు.

''ఎవరు ?'' అన్న గేట్ కీపర్ ప్రశ్నకి జవాబుగా ఉత్తరం చూపాడు.

''అయ్యగారు ఆఫీసు రూంలో వుంటారు వెళ్ళు'' అన్నాడతను.

ముందుకి సాగిపోయాడు రామకృష్ణ.

గదిముందు క్షణ కాలం ఆగేడతను.

స్వింగ్‌డోర్స్ లోనుంచి తొంగిచూసి వచ్చాడులోపన్న కాళ్ళని చూసి ''ఎవరో'' అనుకున్నాడు రామారావు. కానీ అతని రాజసం ఆ ప్రశ్న వేయనీయలేదు.

మరో రెండు నిమిషాల్లో ఎటో వెళ్ళిన ప్యూన్ వచ్చి ''ఎవరు ?' అని అడిగాడు.

''అయ్యగారిని చూడాలి''

''ఎందుకు ?''

ఉత్తరం చూపించాడు రామకృష్ణ.

''ఓహో ఉత్తరం పట్టుకొచ్చావా?'' అని తలుపు తెరుచుకుని లోపలికి వెళ్ళి చెప్పాడు.

''రమ్మను'' అన్నారాయన.

బయటికివచ్చి తలుపు తెరిచి పట్టుకుని ''వెళ్ళండి'' అన్నాడతను. కుడికాలు ముందుగా మోపి గదిలో ప్రవేశించి ''నమస్కారం'' అన్నాడు 'ఎవరు ?' అన్నట్టుగా తలెగరేశాడతను.

సమాధానంగా ఉత్తరం అందించాడు రామకృష్ణ.

''కూర్చో !'' అని ఉత్తరం తెరిచి చదవసాగాడు. కానీ అతను కూర్చోలేదు.

ఉత్తరం అంతా పూర్తిగా చదివి ''ఊఁ

## అనాథ శరణాలయం

ఇంకా ఈడైనా రాని భావాన్ని
ఏ భాషైనా
భేషజంగా బలాత్కరిస్తే
పుట్టిన పద్యాన్ని
గుట్టుచప్పుడు గాకుండా
ఏ పత్రిక వాకిట్లోనో పారేసి పోతే
జాలిపడ్డ ఓ ఎడిటర్ మహాశయుడు
　　　　　　　చేరదీస్తాడు.
వెలుగులో కొచ్చిన పద్యం వ్యతి షోకులు
　　　　　　　వేసేస్తుంటే
అమాయక భావాలెన్నో
అదే ఫేషననుకొని
అమాంబాపతు సరుకుకు ఆత్మార్పణ చేసుకొని
అనాథ పద్యాల నెన్నింటినో కని పారేసిపోతే
ఇంతమంది వేధవర్ని ఇప్పుడు
　　　　ఏం చేయటమో తోచక
ఆ దీన బంధువుడు అప్పుడు బిత్తర పోతాడు

— 'చక్రవర్తి'

## రాతి పెదవులు

రావుగారు నీకు బాగా తెలుసున్న వ్యాలు, బంధువులా ?" అని అడిగాడు.

'కాదండి.'

"స్నేహితులా ?"

"ఊహూ."

"ఒకేవూరా ?"

"అవుననుకోండి. కాని మా పరిచయం. ఏదీ దాచుకోదలచుకోలేదు రామకృష్ణ. 'ఆయనందులో ఏం వ్రాశాడో? తర్వాత అయినా తన విషయం తెలియవచ్చు. అప్పుడు వెలితి పడేకంటే యిది మేలు కదా?' అను కుని అంతా చెప్పాడు రామకృష్ణ.

"ఊ అయితే జైలు నుంచి విడుదలై వస్తున్నావన్నమాట."

"అవునండి."

"సారీ ! నీ వెవరో పూర్తిగా వివరాలు యివ్వలేదు రావుగారు. మంచివాడు ఉద్యోగం ఇవ్వొచ్చు అని మాత్రం రాశాడు. అంతే! అంత మాత్రాన ఉద్యోగం యివ్వలేను. పైగా ఆయనెందుకో నీ జైలు విషయం వ్రాయ లేదు. ఇంతకీ నీవు చేసిన నేరం ఏమిటి ?'

రామకృష్ణ ముఖం జేవురించింది.

"క్షమించండి. నేనెవరో తెలిసింది. గడిచిన నా గతంతో మీకు అవసరంలేదు. ఇవ్వగలిగితే ఆ పత్రం పైనే ఉద్యోగం యివ్వాళ్ళు. ఫలితం లేకపోయాక మీ కెందుకు శ్రమ" అని గిఱుక్కున వెనుదిరిగాడు రామకృష్ణ.

"రామకృష్ణా."

తల తిప్పాడతను.

"కొన్ని రోజులాగి కనిపించు ప్రయత్నిస్తాను" అన్నాడు.

'థాంక్స్' అని కదిలాడతను.

ఆ నిరాశ అయిపోయింది. ఉద్యోగం దొరుకుతుందని తనూ నలుగురిలా తలెత్తుకుని తిరగొచ్చని అనుకున్నాడు. కాని మళ్ళీ నిరుద్యోగి ఎదురైంది.

కాళ్ళీడ్చుకుంటూ దారి పట్టాడు రామకృష్ణ.

ఆ రోజల్లా కనిపించిన కంపెనీలన్నీ తిరిగాడు. ఎక్కడ చూసినా నో వెకెన్సీ బోర్డ్. ఎవర్నడిగినా ఖాళీల్లేవనే మాటే. తిరిగి తిరిగి గుడిచేరాడు అతను. అలసిపోయిన శరీరం నిద్రలోకి జారిపోయింది.

తెల్లగా తెల్లవారుతుంటవగా అవతలి వేపు

గాజుల చప్పుడై కళ్ళు తెరిచాడు రామకృష్ణ.

"గుడ్ మార్నింగ్!".

అప్రయత్నంగా "గుడ్‌మార్నింగ్" అన్నాడు రామకృష్ణ.

"బ్రదర్ అనటానికి మనసొప్పటం లేదు. శ్లాఘ్యుడైన వాడివి. జోడైనవాడివి. బావా అంటే ఎబ్బెట్టుగా వుంటుంది... పేరుతో పిలుస్తాను. ఏం పేరు? అన్నట్టు నా పేరు గీత. నా గీత బాగాలేదు. తల్లీ తండ్రీ పోయారు. ఒంటరిదాన్ని. లోకాన్ని చించి చెండాడి బ్రతుకుతున్నాను నీవో!"

నిదుర మత్తంతా వదిలిపోయిందతనికి.

"ఎవరీ అమ్మాయి?" అనుకున్నాడు.

"చెప్పవేం?"

"నా పేరు రామకృష్ణ ... నిరుద్యోగం ప్రస్తుత ఉద్యోగం. మాజీ ఖైదీని"

"అన్యాయంగా జెయిలు కెళ్ళావుకదూ? ఎలా కనుక్కున్నాననా? బెరుకు బెరుకుగా ఆ మాటలనటంలోనే తెలుస్తూవుంది నీ వాలకం. ఎక్కడ మకాం?"

"గుడిలో పడుకున్నానే తెలీటంలా?"

"అవుననుకో. ఎక్కడయినా ఓ కొంప చూసావా? ఇద్దరం కలిసి వుందాం. ఒప్పు చేయటానికయినా తప్పు చేయటానికయినా మనిషికీ మనిషి తోడుండాలి అదీ ఆడదానికి మగాడు మగాడికి ఆడది తోడుంటే యింకా నిర్భయం."

"ఇంతకీ నీ వేం చేస్తుంటావ్?"

పకపక నవ్విన తర్వాత అంది "యవ్వనంలో వున్న ఆడదేం చేస్తుంది? వీలయితే కండలమ్ముకుంటుంది. లేదా ఒళ్ళమ్ముకుంటూంది? ఇందులో ఏది సాధ్యమయితే దానితో బ్రతుకున్నాను. బ్రతకటం ప్రశ్న అయినప్పుడు మార్గ మేమిటన్నది ప్రశ్న కాదు కదా? భగవంతుడిచ్చిన ప్రాణాల్ని తోడేసే హక్కు మనకి లేదు. చేతనయిన మార్గంలో బ్రతకటమే!

అయినా యీ మగవాళ్ళకి ఆడది పని కావాలంటూ వస్తే వాళ్ళకి కనిపించేది ముందుగా మా వంపులు సొంపులు మాత్రమే! మేం నిజాయితీగా వుండాలన్నా మీరు వుండనీరు."

"కానీ ఒకమాట వినాలి–

నేనూ తెగిన గాలిపటాన్ని. నీవు వాలు వెంట వీలు వెంట ఎగురుతున్న గాలిపటానివే. మనిద్దరం కలిసి వుండాలంటే కొన్ని కండిషన్సకి లోబడాలి నివు.

అవసరమైనంత వరకు నీతిగానే బతుకుదాం. అత్యవసర పరిస్థితుల్లో బుద్ధి ఎలా లాగితే అలా వెళదాం. నేను నిన్నేం ఆదు పాజ్జాల్లో పెట్టాలనుకోను నన్ను నీవు బంధించాలని అనుకోవద్దు. కలిసి బతుకుదాం అంతే! ఇదో కాంట్రాక్ట్. షియర్ ఎగ్రిమెంట్. అంటే ఒప్పందం మాత్రమే!

పద నా వద్ద కొంత డబ్బుంది. ఎక్కడైనా యింత టిఫిన్‌తిని యిల్లు వెతుక్కుందాం" అని లేచాడు రామకృష్ణ. గీత అనుసరించింది.

* * *

అతి కష్టం మీద యిల్లు సంపాదించారిద్దరూ.

ఇంట్లో చేరిన రెండో రోజున పక్కింటి ఆమె వచ్చి "మీ ఆయన ఎక్కడికి వెళ్ళారమ్మా?" అని అడిగినపుడు గీత ముందు తెల్లబోయింది. తర్వాత తనలో తను నవ్వుకుని "బయటికి వెళ్ళారమ్మా?" అంది

"ఏం ఉద్యోగం?"

"ఇంకా దొరకలేదు. ప్రయత్నంలో వున్నారు"

"పెళ్ళయి ఎన్నేళ్ళయిందమ్మా"

"ఎక్కడిదమ్మా. ఇంకా మూడు నెలలు దాటలేదు"

"మీ అత్తా మామా లేరా?"

"ఊహూఁ నాకే కాదు ఆయనకీ లేరు" లంది తనలో తనే నవ్వుకుంటూ

"అయ్యో పాపం" అని అకస్మాత్తుగా "మెడ బోసిగా వుందమమ్మా!" అని అడిగింది.

"నిన్న రాత్రి తెగిపోయాయమ్మా" అంది నాలిక కరుచుకుని

"అయ్యో రాత! తెగిపోయాయనకూడదు. పెరిగిపోయాయనాలి అయినా అలా ఖాళీగా వుండకూడదు. పసుపు తాడైనా కట్టుకోవాలి"

"కొంచెం ఆగు పెద్దమ్మా తెస్తాను. నీ చేతులతో కట్టిపోదువు గాని" అని యింట్లోకి వెళ్ళి దారం పేని పసుపుతో తడిపి తెచ్చింది ఆమె.

"ఖాళీ దారం కాదమ్మా పసుపు కొమ్ము ఉండాలి. మా యింట్లో వుంది నే తెస్తానుండు" అని వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళాక "యీ దేశంలో మగవాడికి ఎంత బాధ్యత వుంది? మెడలో దారం కూడా బిగిస్తాడు. ఎంతయినా మగాడు మగాడే!" అనుకుంది.

ఆ ముద్దరాలు పసుపు కొమ్ము తెచ్చి ముడివేసింది "నీ చేత్తోనే ముడెయ్యమ్మా" అంటే అలాగే ముడివేసింది. మాటామంతీ మాట్లాడి వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిన మరో గంటకు ఉస్సురని నిట్టూరుస్తూ వచ్చాడు కృష్ణ.

బెల్లం కాఫీ యిచ్చింది గీత

"ఈ రోజా దండుగే అయ్యింది గీతా! మనుషులు వాసన కొడతారా ఏం? వీడు దొంగ – వీడు జైలుకి వెళ్ళి వచ్చాడు వీడు



## రాతి పెదవులు

పాపి అన్నది ఎలా తెలుస్తాయో? దాచాలన్నా దాగవా? ఏం."

"అధికార్లూ ధనవంతులూ అంతా ఒక గ్రూప్. ఒకరి విషయం మరొకరు తెలుసుకుంటారు. వాళ్లకి ఫోన్నుండే దేందుకు? ఫలానా రామకృష్ణ నా వద్దకి వచ్చాడు. నీ వద్దకీ వచ్చాడా? ఏం చెప్పావు? ఖాళీ లేదన్నావా? నేనూ అదే అంటాను. అని మాటాడుకుంటారు. పైకి మాత్రం సాదరంగా 'సారీ!' అంటారు"

నిట్టూర్చాడు రామకృష్ణ.

"ఏం చేయాలో పాలుపోవటం లేదు? ఆఖరిగా మేస్త్రీగా పనిచేస్తానన్నా కుదర్లేదు. రేపు ఏదో క్లాత్ ఎంపోరియంలో ఖాళీ వుందన్నారు. వెళ్లి అడగాలి"

అతన్ని కొద్దిగా నవ్విద్దామని మధ్యాహ్నం జరిగిన సంఘటన నవ్వుతూ చెప్పింది. "ఆమె తాళి కట్టింది కాబట్టి నా భర్త ఆమే! అయినా రామకృష్ణా! పెళ్లిళ్లు మగాళ్లూ ఆడాళ్లే ఎందుకు చేసుకోవాలి. ఆడవాళ్లు ఆడవాళ్లని మగవాళ్లు మగవాళ్లని చేసుకోకూడదా?"

నవ్వాడతను. "అమెరికాలో అలాగే చేసుకుంటూ వున్నారు. కొన్నేళ్లుపోతే మన దేశంలోనూ మగ దంపతులు, ఆడ దంపతులు తయారవుతారేమో!" అన్నాడు.

తర్వాత తర్వాత సంభాషణ ఎలాగెలాగో సాగిపోయింది.

భోజనం చేసి పడుకున్నారిద్దరూ.

అకస్మాత్తుగా ఒకవేళ మెలకువ వచ్చింది. గీతకి. చిన్నగా బెడ్‌లాంప్‌ని పెద్దచేసి ప్రశాంతంగా నిదురవోతున్న రామకృష్ణని చూసింది.

"ఎంత హాయిగా నిదుర పోతున్నాడు. అదృష్టవంతుడు" అనుకుంది.

అంతలో మధ్యాహ్నం ఆమె అన్న విషయం గుర్తుకొచ్చింది.

"తామిద్దరూ కలిసి దాదాపు పదిహేను రోజులుగా జీవిస్తున్నారు. అయినా అతను తన వేపు కొంటె చూపు కూడా చూడలేదు. ఒక్క పొల్లు మాట కూడా అనలేదు. చాలా నీతిమంతుడిలా వున్నాడు. అతని కేదయినా ఉద్యోగం దొరికి, తన కేదయినా పని దొరికితే తర్వాత తనని పెళ్లి చేసుకోమని అడగాలి.

తను చెడిపోయిందన్న మాట నిజమే కాని యిపుడు నిజాయితీగా వుంది. ఇక ముందు వుంటుంది. నిజంగా ఒకసారి తప్పు చేస్తే మళ్లీ మోక్షం వుండదా? తప్పునుంచి బయట పడే అవకాశమే వుండదా? ఇక జీవితమంతా అలాగే వుండిపోవాలా? వీలులేదు. అలాకాదు. తప్పు సరిచేసుకుని బాగా బతకొచ్చు."

ఆ ఆలోచన వచ్చాక మనస్సు శాంతించింది. తర్వాత ప్రశాంతంగా నిదురవోయింది.

* * *

"గీతా! ఆ టెక్స్‌టైల్ కంపెనీలో సేల్స్‌మన్‌గా ఉద్యోగం దొరికింది" ఉత్సాహంగా చెప్పాడతను.

"నిజమా?"

"ఊఁ కానీ జీతం చాలా తక్కువ. నెలకి ముప్పై."

"పోనీలే ఎంతో కొంత. నేనూ ఆ చివరి మేడ వాళ్లింట్లో పనికి కుదురుకున్నాను. రెండు పూటలా భోజనం పెట్టి పాతికిస్తార్ట"

"ఏం పని"

"ఆ పని యీ పని అన్లేదు. అన్నీ చేయాల్సిందే"

"పోనీలే! ఏదో ప్రస్తుతానికి...మళ్లీ ప్రయత్నం చేద్దాం"

రోజులు సుఖంగా గడిచిపోతున్నాయి.

ఒకరోజు షాపులో రామకృష్ణ వుండగా జైల్లో అతనితో వున్న ఒకతను వచ్చాడు. అతనిది ఆ వూరేనట. పలుకరించాడు. అతడు జేబులు కొట్టడంలో దిట్ట. ఆ విషయం అందరికీ తెలుసు. పాపం రామకృష్ణ రోజులు బాగాలేవు. అతనితో మాట్లాడుతూ వున్న రామకృష్ణని చూసి ప్రొప్రైటర్ పిలిపించి అడిగాడు.

విషయం దాచే అవకాశం లేక చెప్పాడు.

"చాలు! చాలు! దొంగల్ని పోషించే వ్యాపారం కాదు మాది. జరిగింది చాలు. దయచేసి వెళ్లిపో. నా అంగటిపై సీతకన్ను మాత్రం వేయకు" అని పూర్తి నెల జీతం యిచ్చి పంపేడు. రామకృష్ణకి మరో మాట మాటాడే అవకాశం లేకపోయింది. దిగాలుపడి యింటికి వచ్చాడు.

మధ్యాహ్నం యింటికి వచ్చిన గీత విషయం విని నిర్ఘాంత పోయింది. "మనుషులు మనుషుల్నే నమ్మరు? ఏం చేయాలి? ఎలా బతకాలి? సంస్కరణ అంటూ పెద్ద

పెద్ద మాటలు మాటాడతారు మళ్ళీ" అంది ఆవేశంగా.

రామకృష్ణ మాటాడ్లేదు.

ఎంత ప్రయత్నించినా అతనికి మళ్ళీ ఎక్కడా ఉద్యోగం దొరకలేదు. రిక్షా లాగాలని చూచినా బాడుగకి ఎవ్వరూ యివ్వలేదు. బస్టాండులో, రైల్వే స్టేషన్లో మూటలు మోయాలని చూశాడు. కానీ అక్కడ తన కంటె అధ్వాన్నంగా జీవిస్తూ ఆ కూలిమీద బ్రతికే మనుష్యుల్ని చూసి పోటీ పడ్లేక వచ్చేశాడు.

ఎలాగో గీత సంపాదన మీదే. ఒకపూట తినీ తినక నెట్టుకొస్తున్నారు వాళ్ళు.

ఆ రోజు ఉదయం పనికి వెళ్ళిన గీత మరో అరగంటలోనే యింటికి వచ్చింది. ఆమె ముఖమంతా నెత్తురుచుక్క లేక పాలిపోయింది.

"గీతా!"

"కృష్ణా! లాభం లేదు. మనం నిజాయితీగా బ్రతకలేం. ఈ లోకంలో దండుకుని బ్రతికే వాళ్ళకే అవకాశం"

"ఏమయింది గీతా!"

"నే పనిచేసే యింటి ఆవిడ పుట్టింటికి వెళ్ళిపోయింది. ఈ వారం రోజులుగా అతను నా పైన చూపే అభిమానం అదీ చూసి నాకు అనుమానం కలిగింది. నేనేం లోకం తెలియని దాన్నా? ఈ రోజు ఒంటరిగా చూసి చేయి పట్టుకుని తన కోర్కె వెల్లడించాడు. ఛీకొట్టి వచ్చేశాను"

రామకృష్ణ ముఖం నిండా రక్తం గూడు కట్టింది.

"పద. వెధవకి బుద్ధి చెపుదాం"

"వద్దు అనవసరంగా పెంటికి పడాలి మనం. ఈ పెద్దవాళ్ళు మన మాటల్ని నమ్మరు. మనమే బ్రతుకుతెరువు కోసం తప్పు చేయ బోయామంటారు."

"గీతా!"

"కోపంతో ఫలితం లేదు కృష్ణా! మన కోపాలన్నీ పెదవుల చేటు. పదవుల చేటు. అంతే!"

ఇంట్లో వుండలేకపోయిన రామకృష్ణ బజారున పడ్డాడు.

పగలల్లా తిరిగి తిరిగి అలిసిపోయాడు కృష్ణ.

చీకటి పడుతూ వుండగా తను తొలినాడు దర్శనం చేసుకున్న స్వామి గుడికి వెళ్ళాడు.

## రాతి పెదవులు

అతని మనస్సులో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయ్.

ఏం చేయాలి?

ఎలా బతకాలి?

ఇవే ప్రశ్నలు అతని ముందు యింతింతై పెరిగి పెరిగి మనస్సంతా ఆక్రమించుకున్నాయ్.

అతనికి గత్యంతరం కనిపించటంలేదు.

బాగా పొద్దుపోయాక అతనో నిశ్చయానికి వచ్చాడు.

ఆ నిశ్చయానికి వచ్చే వేళకు మొదటి ఆట విడిచారు.

ఓ సినిమా హాలు వద్దకి వెళాడు రామకృష్ణ.

జనం గుంపులు గుంపులుగా బుకింగ్ వేపు పరిగెడుతున్నారు అది ఆంధ్రుల అందాలఅభిమాన నటుడు నటించిన చిత్రం. సూపర్ హిట్ అయిన హిందీ చిత్రానికి రీ మేక్. రిక్షా వాళ్ళు మొదలుకొని పెద్ద పెద్ద మనుషుల వరకూ టికెట్ కై ఎగబడుతున్నారు.

నేర్పుగా మందిలో జొరబడ్డాడు రామకృష్ణ. మనుషుల్ని నెట్టుకుంటూ అభిమన్యుడిలా చొరబడ్డాడు. బాగా బలిసిన జేబు కనిపించింది. చకచకా సెకండ్లలో పని ముగిసింది. 'సినిమాలకి వస్తూ యింత డబ్బు ఎందుకు వెంట తెచ్చుకుంటారో' అనుకున్నాడు. 'అయినా తనలాటి వాళ్ళు వేలు! లక్షలు!! వున్నారు. వాళ్ళెలా బ్రతకాలి'

అతని మనస్సూ శరీరమూ కొద్దిసేపు వణికిపోయాయి.

నూరు డిగ్రీల టెంపరేచర్ వున్న వాడిలా కదిలిపోతున్నాడతను. అలవాటులేని 'కొత్త' వైష్ణవం. మెల్లిగా కదిలి రిక్షాలో ఎక్కాడతను. "పోనీ" అన్నాడు.

సరిగ్గా ఆ సమయంలో 'దొంగ! దొంగ!' అన్న కేకలు "నా జేబు కొట్టేశారు" అన్న ఆర్తనాదమూ వినిపించాయ్.

"త్వరగా పోనీ" అన్నాడు రామకృష్ణ.

వింతగా చూచిన రిక్షావాడు ముందుకి సాగాడు.

తమ పాక మరో పదిగజాలుందనగా దిగిపోయి రిక్షావాడి చేతిలో రూపాయి పెట్టేసి

# ధర్మ పథం



బులుసు వేంకట రమణయ్య

## శ్రీ రామకృష్ణుల కాళీపూజ

శ్రీరామకృష్ణ పరమహంస కాళీదేవినే ఆరాధించి ఆమెయందే పరబ్రహ్మమును దర్శించిరి. ఆయనకు— పర బ్రహ్మమునకును దేవికిని భేదము తోచెడిది కాదు.

"ఆయన కాళినే ఎందుకు పూజించాలి?" అనే సందేహం కొందరికి కలగవచ్చును. కాళి సింహవాహన అని అందరికీ తెలుసు.

మదించిన ఏనుగు మామూలు ఏనుగులవలె సాత్వికంగా వుండి, మావటివాని చెప్పుచేతల ననుసరించి ప్రవర్తించదు. అది యెవ్వరికీ లొంగక ఇచ్చవచ్చినట్లు విహరిస్తుంది. సింహాన్ని చూచినప్పుడే అది లొంగుబాటులోకి వస్తుంది. ఆ విధంగానే— మనస్సు మిక్కిలి చంచలమైనది. అది యెప్పుడూ యిచ్చవచ్చినట్లు విహరిస్తుంది. అట్టి మనస్సును నొక్కిపెట్టి స్వాధీనంలో ఉంచుకోవడానికి సింహవాహన అయిన దేవి యొక్క అనుగ్రహం కావలసి ఉన్నది.

భక్తులను అనుగ్రహించే ఆ దేవి నీల దేహంతో భయంకరంగా ఎందుకు ఉండాలి? అనే సందేహం కూడా కలగవచ్చు.

సింహవాహన అయిన దేవి స్వరూపం సాత్త్వికంగా ఎలా కానవస్తుంది? సాత్త్వికంగా ఉంటే మనస్సనే మదపుటేనుగును ఎలా అదుపులో పెడుతుంది?

దూరం నుంచి చూస్తే కొంత భయంకరంగా కానవచ్చినా, ఆమె చేరువకు వస్తున్న కొద్దీ ఆ భయంకర రూపం సాత్త్వికరూపంగా మారిపోతుంది.

ఆమె స్వరూపం నీలంగా కానవచ్చినా, ఆమెకు ఏ వర్ణమూ లేదు. మనకు సముద్రం నీలంగా కనపడుతుంది ఆకాశమూ నీలంగా కానవస్తుంది. వాస్తవానికి వానికి ఎట్టి రంగూ లేదు కదా! ఆ విధంగానే దేవిని సమీపించిన కొద్దీ ఆ రంగు క్రమంగా తగ్గిపోయి ఆమె తేజస్సే దృగ్గోచరమవుతుంది,

భగవంతునికి మనం దూరంగా ఉన్నంత కాలం— అంటే భగవత్తత్త్వాన్ని తెలుసుకోలేనంతకాలం అతనిని అనేక నామాలతో పిలుస్తూ ఉంటాము. అనేక రూపాలను కల్పిస్తాము. భగవంతుని తత్త్వాన్ని తెలుసుకున్న తర్వాత— అతని సాన్నిధ్యం చేరే స్థితిని చేరినపుడు— అతనికి ఎట్టి నామములూ లేవనీ, ఏ స్వరూపమూ లేదనే తెలుసుకోగలము.

కాళి మనకు దేవిగా కానవచ్చినా తత్త్వాన్ని తెలుసుకున్నవారికి ఆమెకూ పరమాత్మకూ భేదం లేదని తెలియక మానదు.

సగుణుడుగా అనుకుంటున్న భగవంతుడే నిర్గుణుడు అతడే సగుణ - నిర్గుణాలు రెండింటికిన్నీ అతీతుడయిన సచ్చిదానంద స్వరూపుడు!

కాళీపూజ చేసినా, మరో దేవతను పూజించినా రెండూ సమానమే! అయినా కాళిని పూజించడంలోని ప్రత్యేకత తొలుత నే వివరించబడింది.

---

గబగబా ముందుకి నడిచాడు.

సరిగ్గా ఆవేళకి గీత, ఆమె వెంట ఓ యువకుడు, ఇద్దరు పోలీసులు బయటికి వచ్చారు.

పరుగు పరుగున వెళ్ళాడు రామకృష్ణ.

"ఏమిటిది ?"

"నీ వెవరు ?" జబర్దస్తీగా అడిగారు పోలీసులు

"ఈమె ఏం చేసింది ?"

"వ్యభిచారం చేస్తూ వుంటే పట్టుకున్నాం''

నిర్ఘాంతపోయి "గీతా !" అన్నాడు అతను తను కుటుంబాన్ని లాగటానికి దొంగతనం చేస్తే, ఆమె కూడా తప్పు చేసింది. అందుకే ఆడవాళ్ళకి గురి కుదరాలే కాని ఎంత త్యాగమయినా చేస్తారు.

"సరే!"

"నీకు పాతకాతానా ? సారీ మిస్టర్. కేసు బుక్ చేశాం. కోర్టులో జన్మానా కట్టి విడిపించుకో" అని కదలబోయారు,

అంతలో రిక్షాలపై నలుగురైదుగురు వచ్చారు.

"అడుగో" అని చూపించాడు ఓ రిక్షావాడు. అతను రామకృష్ణని యింటివద్ద దించి వెళ్ళిన వాడు.

"ఏరా రాస్కెల్! సినిమాకని వచ్చి జేబు కొట్టి పారిపోయి వస్తావా.?" చొక్కా పట్టుకుని నిలేసి తిడుతూ రామకృష్ణ జేబులు వెదికి ఆ పర్సు తీశాడు. ఆ ఆసామి "అమ్మ! దొంగ ముండా కొడుకా! ఇదన్నటా నీ బ్రతుకు ఇలా బతికే కంటే చావరాదట్రా." చెడామడా తిడుతూ కొడుతున్నాడతను.

ఆ మాటలు విన్న గీత నిర్ఘాంతపోయింది, పోలీసుల్ని విడిపించుకుని రివ్వున దూసుకుని వెళ్ళింది. రామకృష్ణని కొడుతున్న అతన్ని పక్కకి లాగి బూతులు తిట్టింది ఆ వేశంలో ఆగ్రహంతో ఊగిపోతోంది ఆమె.

"వినండయ్యా వినండి. మేం ఒళ్ళు బలిసి తప్పుచేయలేదు. కడుపుకి జరక్క తప్పుచేశాం. నిజాయితీగా బ్రతకాలని నెలల పర్యంతం కష్టపడ్డాం. ఉప్పునీరు మరిచి పనులు చేశాం. ఫలితం ఏమిటి ? ఎప్పుడో నేరం చేశాడన్న మిషమీద అతన్ని తీసేసి నిష్ప్రయోజకుడిని చేశారు నిజాయితీగా పనిచేస్తూ వుంటే నన్ను బలవంతం చేయబోయారు. తిరస్కరిస్తే యింట్లోంచి వెళ్ళగొట్టారు

మరో మార్గం లేక- బ్రతికే వీలులేక ఏదీలేక ఈ పనిచేశాం. నీతిగా నిజాయితీగా బ్రతకాలనే మేమూ ఆశపడ్డాం. కానీ మా ఆశ నిరాశ అయ్యింది. మనుషులం మారాం అని నమ్మలేదు లోకం. మీరంతే అంది. అలా చేయబోయి మీకు చిక్కిపోయాం.

కానీండి ఈరాతి పెదవులు ఇక కలియవు. మాకు ఈ సంఘంలో కంటే ఆ కటకటాల్లోనే భద్రత వుంది. పదండి.''

గీత మాటలు విని అందరూ క్షణం సేపు నిర్ఘాంతపోయారు. అంతే! తేరుకుని. 'రంకు నేర్చిన ముండ బొంకు నేర్వదా వెళ్ళండి. తీసి కెళ్ళి కొట్లో తోసెయ్యండి ఇద్దర్నీ. బుద్ధి వస్తుంద'ని అన్నారు

నిర్వికారంగా పోలీసుల వెంట నడిచారు ముగ్గురూ.

# డాక్టర్ సలహాలు

**జి. ఎమ్. అనంతపూర్**

నాకు మూత్రము తరచుగా వస్తుంది. మనిషిని బాగా లావవుతున్నాను. సన్నపడడానికి ఏదైనా ఉపాయము తెల్పండి.

తరచుగా మూత్రం విసర్జించడం అనేది అనేక కారణాల వల్ల వచ్చే అవకాశం ఉన్నది. వీటిలో ముఖ్యంగా, ఎక్కువగా పలుమార్లు నీరు త్రాగటం ఒక అలవాటుగా ఉండేవారికి, డయాబెటిస్ అనబడే (మధుమేహం) అతి మూత్ర రోగం వల్ల, పిట్యూటరీ గ్రంథిలోని ఒక భాగం పనిచేయకపోయినా, ఇలా మూత్ర విసర్జన తరచు జరుగవచ్చును.

కాని పైన చెప్పినవి గాకుండా కొందరికి మూత్రనాళంలో ఉండే కొన్ని కండరాల పట్టు సడలిపోవటంవల్ల, మూత్రకోశం (బ్లాడర్)లో ఏమాత్రం మూత్రం చేరినా, అది వెనువెంటనే విసర్జింప జేసుకోవలసి రావటం వల్ల కూడా తరచూ మూత్ర విసర్జన చేయవలసి రావటాన్ని 'స్ట్రెస్ ఇన్‌కాన్టినెన్స్'' లేక ''ఇన్‌కాన్టినెన్స్'' అంటే మూత్ర విసర్జనను అదుపులో ఉంచుకోలేకపోవటం అని అంటారు.

ఏ కారణంవల్ల అయినదీ పై విషయాల కొరకై వైద్య పరీక్ష, మూత్ర పరీక్ష అవసరమేగా!

లావు తగ్గడానికి ప్రత్యేకంగా మందులు ఏవీ లేవని ఆహారం తీసుకోవటంలో తప్పనిసరిగా నిబంధనలు (అంటే తగ్గించి తీసుకోవటం) పాటించవలసి ఉంటుందనీ నా అభిప్రాయం''. అన్నం మానేసి గోధుమ రొట్టెలు తింటున్నామంటూ ఎందరో, సలహాలడుగుతూ వైద్యులకు తెలియజేస్తారు. శరీరానికి కావలసింది ''కాలరీ'' అనబడే శక్తి ధాతువులే గాని, అది ఏ రూపేణా శరీరంలోకి పంపించినా ఒకటే!

పోనీ ఆ తినే రొట్టెలు ఒకటో లేక రెండో తిన్నా అంత బాధలేదు. ఉపోషం పేరిట రెండింతలు వేరే ఇతరత్రా మార్గాల ద్వారా ఆహారాన్ని తీసుకునే ఈ రోజుల్లో లావు తగ్గటానికి మీరు ప్రత్యేకంగా శ్రద్ధ చూపించదల్చుకుంటే ఆహారాన్ని తప్పనిసరిగా తగ్గించండి. అంతకన్నా మంచి మార్గంలేదు.



**డి. సి. ఆర్ – నింపూరు**

నా కుమార్తెకి వయస్సు 7న్నర సం. లు. మూడు మాసముల నుంచి జ్వరము వచ్చి వెంటనే శరీరమంతా నొప్పులు ప్రారంభమై మొడుకులు, భుజములు ఆడుట లేదు. డాక్టర్ సలహాపై చికిత్స చేయించాము. గుణము కనిపించలేదు. ఇది 'రుమాటిక్' జ్వరం క్రమేపీ తగ్గుతుంది, ఒక్కసారి తగ్గదు అన్నారు.

★ 'రుమాటిజమ్' అనే రోగం, పిన్న వయస్సులోనే ఏర్పడటం చాలా సహజం. ఈరోగం ఉన్నవారికి మొదట్లోనే ఆ రోగాన్ని నిర్ణయించడం, అటుతర్వాత క్రమంతప్పకుండా వారానికో మారుగా ''పెనిడ్యూర్ ఎల్ ఎ 6 ఇంజక్షనులు, 10 వారాలపాటు వేయించుకోవటం ఫినైల్ బ్యూటా జోన్, మాత్రలు రోజుకి 3 వంతున 10 రోజులపాటు వాడటం ముఖ్యం. ఇంతవరకు కూడా ఈరోగానికని ప్రత్యేక కారణం కనిపెట్టబడకపోయినా, శరీరంలో చీము పట్టగల ప్రదేశాలు ఉన్నవారికి ఈ రోగం వస్తుందని ప్రస్తుత అంచనా.

–డా. కె. వెంకటేశ్వరరావు

# వంటలు

## మహారాష్ట్ర వంటకాలు

### సగ్గుబియ్యం

"సాబూదాన్" అంటె సగ్గుబియ్యం మహారాష్ట్రీయులు ఎక్కువగా ఈ వంటకం తింటారు. వీరు వుపవాసమున్నప్పుడు విధిగా ఈ కిచిడి చేసుకొంటారు. ముందుగా సగ్గుబియ్యాన్ని ఒక గంట నాననివ్వాలి. ఒకచెంచా పంచదార, చిటికెడు పసుపు, తగినంత ఉప్పు వేయించిన వేరుశనగపప్పు పొడి పచ్చిమెరపకాయలు మెత్తగా నూరిన మిశ్రమము అన్ని వడగట్టివుంచిన సగ్గుబియ్యంలో కలపాలి. స్టవ్‌మీద గిన్నెవుంచి దానిలో నెయ్యివేసి కాగాక ఆ గిన్నెలో అన్నీకలిపి వుంచిన సగ్గుబియ్యం పోసి, పది, పదిహేను నిముషాలు వుడకనిచ్చి దించాలి. కొలతలు సందర్భాన్నిబట్టి ఎవరి యిష్టప్రకారంవారు వేసుకోవచ్చును.

### "కాందపుహే"

"కాందా" అంటె వుల్లిపాయలు 'పుహే' అంటే అటుకులు.

అటుకులు మెత్తపడేవిధంగా దానిలో నీళ్ళు జల్లి వుంచుకోవాలి. బాణలిలో నూనెవేసి దానిలో తరిగిన వుల్లిపాయముక్కలు బంగాళ దుంపముక్కలు వేసి వేగనివ్వాలి. అవి వేగాక జీలకర్ర, ఆవాలుకూడ వేసి ఈ అటుకులు దానిలో వెయ్యాలి. తరువాత పసుపు ఉప్పు పంచదార, కొత్తిమేర, ఇష్టమున్నవారు సన్నగా కోరిన కొబ్బరికోరు వేసి వుడకనిచ్చి దించాలి. కొలతలు సందర్భాన్నిబట్టి వేసుకోవచ్చును.

### వాట్లిదాల్

సెనగపప్పు నీళ్లలో బాగా నాననివ్వాలి. నానిన సెనగపప్పుని రోట్లోవేసి మరీమెత్తగా కాకుండ పలుకు వుండే విధంగా రుబ్బుకోవాలి. జీలకర్ర, వెల్లుల్లి, పచ్చిమెరపకాయలు, అల్లం, పసుపుకూడ దంచుకొని ఈ ముద్దను సెనగ పిండిలోవేసి కలపాలి. గిన్నెలో నూనెవేసి నూనె మరిగాక ఈ సెనగపిండి ముద్ద దానిలోవేసి అడుగంటకుండ కలుపుతూ వుండాలి. దీనికి నూనెకాస్త ఎక్కువపడుతుంది. 'వాట్లిదాల్' పొడి పొడి లాడుతూ బాగుంటుంది.

—శ్రీమతి విజయాప్రసాద్ ●

# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

**వి. జె. ఎస్. జగదల్‌పూరు.**

ప్రేమించిన వాళ్లంతా పెళ్లి చేసుకునేతీరాలా ?

ప్రేమ అంటే మీరు చెప్పుకునే అర్థాన్ని పట్టి వుంటుంది. పెళ్లి సంగతి. మీరు ముందరే ప్రేమించిన అమ్మాయితో చెప్పి ఆమె చెప్పే అర్థాన్ని కూడా వినాలి. . నిజమైన ప్రేమ పెళ్ళికి దారి తీస్తుందని ఆశిస్తుంది అడది.

సహనానికి మారు పేరు స్త్రీ అంటారు. కాని మీ జవాబులు చదువుతూంటే అలా అనిపించదు.

అంటే— పడివుండడమే సహనానికి లక్షణమా? స్త్రీకి ఎప్పుడూ వుంటుంది ఓర్పు ఔదార్యం— మంచి చెడు నిర్ణయాలు తెలుసుకుందుకు, పిల్లపాపల మంచిచెడ్డలు ఆలోచించడానికి, కష్టాలను సుఖాలను, దరిద్రాన్ని ఐశ్వర్యాన్ని ఒక్కలాగే చూస్తూ సంసార రథాన్ని సరైన మార్గాన సాగిపోయేలా చూసే అదృశ్య హస్తం ఓర్పుగల స్త్రీదే!.. సహనమూర్తి సంతృప్తికి పర్యాయపదం ఓర్పుకి భూదేవి అన్న ఘనతా— యివన్నీ వున్నా అవమానం, అన్యాయం, అక్రమాలను ఎదుర్కోనవలసి వస్తే— చండి అవుతుంది. మహంకాళి అవుతుంది. అదే స్త్రీత్వపు ప్రత్యేకత ఆమెలో ఔదార్యం ఎంత వుందో ఆగ్రహం అంతా వుంటుంది. ప్రేమకు బానిస అవుతుంది. కక్షను కాలరాసి వేస్తుంది.

**కె. వి. ఎ. పి. ఎస్. విజయవాడ.**

రామలక్ష్మిగారూ, ప్రతి రచయిత, రచయిత్రి ఒక అభాగ్యునికి జరిగిన అన్యాయాన్ని కాని అతని జీవితాన్ని గాని ఆధారం చేసుకుని కథలు రాస్తారే మరి వారి సమస్యలకి పరిష్కార మార్గం చూపరెందుకు?

ఇదీ పరిష్కారం — అని ఎలా నిర్ణయించ కలరు? నిత్యచైతన్యవంతమైన జీవితాన్ని ఒక్క క్షణం పాటు ఒక్క చోట ఆపగల్గితే— ఆ ఆగిన క్షణంలో ఎదుర్కొంటున్న సమస్యకి ఆ క్షణానికి తగినపరిష్కారం సూచించడం సాధ్యమేమో గాని — హోల్ మొత్తం మీద సమస్యల పరిష్కార చిట్కాలంటూ ఎవరూ సూచించలేరు. ఒకవేళ రచయిత సూచించినా ఇదేం పరిష్కారం' అని ప్రశ్నించే హక్కు పాఠకులకు ఎప్పుడూవుండనే వుంది. తీవ్రమైన పరిష్కారం సూచిస్తే కమ్యూనిస్టు, నక్సలైట్‌విప్లవవాది అని ముద్ర వేస్తారు. మామూలుగా సూచిస్తే ఇదో సాంప్రదాయ నవల్లా— యిదేం పరిష్కారం అంటారు. రచయిత మాట లకు మించి పాత్రలు ఎదిగి పోయినప్పుడు— పరిష్కారం సాంఘిక ప్రయోజనం దృష్టిలో వుండాలా అవసర యోగ్యంగా తోచాలా? సినిమాకి పనికివచ్చేలా వుండాలా? కనీసం ఏ పబ్లిషర్కైనా, ఏ పత్రికకైనా ప్రచురించడానికి అంగీకరించ దగినదిగా వుండాలా ? యివన్నీ వర్తమానంలో రచయితకి ప్రశ్నలే. తమ అభిమానులైన రచయితల ఏ రచనలైనా ఆకాశానికెత్తే శక్తి పాతాళానికి అణచేయగల శక్తి— పాఠకులకి, పత్రికలకి వుంది! అందుకే అటూ యిటూ కాకుండా వుంటాయి ముగింపులు.

**కె. పి ఆర్. కడప.**

స్త్రీ పురుషులు సుఖాన్ని అనుభవిస్తారే. ప్రసవ వేదన స్త్రీకే ఎందుకు ?

సుఖం క్షణికం అయినా ఫలితం శాశ్వతం అన్న సత్యాన్ని గ్రహించినప్పుడే— స్త్రీలు బిడ్డ తల్లి కావడానికి సిద్ధపడతారు. ఇక, స్త్రీ పురుషుల కొంతాట కట్టి వారి బంధం శాశ్వతం చేస్తూ బాధ్యతలు బరువులూ సరదాగా మోసే ధైర్యాన్ని ఉత్సాహాన్ని యిచ్చేదే— పిల్లలు. అంచేత స్త్రీ ప్రసవ వేదన బాధ అనుకోదు. ఆ బాధను మరిపించే చిన్నారి శిశువుని చూసుకుని! ఇక ఇలా సుఖం — ప్రసవం— వరస అనంతంగా సాగించడం — స్త్రీ అందుకే— సుఖానికీ పిల్లలకీ ముడి పెట్టకుండా ఈ బరువు చాలు అనుకోగానే పరిమిత కుటుంబం లక్ష్యంగా భావిస్తున్నారు. ఆధునిక యువతీ యువకులు. తీయని జీవితానికి, అటంకం వుండదు. ఆలంబన వుంటుంది. అదే కదా కావలసినది. "కుటుంబ నియంత్రణ ప్రచారం' చేస్తున్నానని నవ్వుకుంటున్నారా? — నవ్వుకోండి. అంత మాత్రంచేత— నిజాన్ని కాదనలేరు! నా లాగా నిర్భయంగా ఒప్పుకోలేని పిరికితనం— అంతే అనుకుంటా.

**డి. సి. కె. అనంతపురం.**

నేనొక చిత్రాన్ని తీయాలని, అందులో మీకు గయ్యాళి అత్త పాత్రనివ్వాలని. ఒప్పుకుంటారా?

నేను ఒప్పుకోను. ఆడపిల్లల విషయంలో నేను పూర్తిగా వాళ్ల పక్షం. కోడలైనా, కూతురైనా నాకు ఒకటే.

**ఆర్. కె. పి. హైదరాబాదు.**

మనస్సునర్థం చేసుకోకలవారు స్త్రీలే (25.6.76) అని మీ జవాబు. నిజానికి పురుషులు ఎదుటివారి మనస్సు అర్థం చేసుకొన్నట్టుగా స్త్రీలు అర్థం చేసుకోలేరు.

అయితే మీరు చెప్పే కబుర్లు అబద్ధాలన్న మాట! స్త్రీ మనస్సు అగాధం. దాన్ని తెలుసుకోవడం అసాధ్యం. అంటూంటారే — దాని అర్థం ఏమిటి? మీకు అవసరమైనప్పుడు ఆడదిఅర్థం అవుతుంది, ఆమె విషయాలొచ్చినప్పుడు— మీకు ఆమె అర్థం కాదు. అంతేగా. ●

## చేసిన పరీక్షల వలన తేలింది...







# రుచికీ, విటమిన్లకూ, పుష్టికీ బిస్కట్ అంటేనే ఇది

## బ్రిటానియా గ్లూకోజ్-డి



బ్రిటానియా గ్లూకోజ్-డి బిస్కట్లతో పాటు మరో ప్రముఖ బ్రాండ్ గ్లూకోజ్ బిస్కట్లను పోల్చి చూసేందుకు చేసిన పరీక్షల వలన తేలిందేమిటంటే: విటమిన్లు మరియు మొత్తం మీద పుష్టినిచ్చే పదార్థాలు గ్లూకోజ్-డిలో ఎక్కువగా ఉన్నాయని. అంతేగాక రుచికోసం, తియ్యదనం కోసం, కరకరలాడే తనానికి దీనిని కావాలంటారని. శక్తినిచ్చే విషయంలో, గ్లూకోజ్ కన్న గ్లూకోజ్ డి 20% ఎక్కువ శక్తినిస్తుంది!

బ్రిటానియా గ్లూకోజ్-డి-తియ్యటి రుచితో కూడిన శక్తి!




అందుకే మరి ఏ ఇతర గ్లూకోజ్ బిస్కట్ కన్న బ్రిటానియా గ్లూకోజ్-డి అంటేనే ఎక్కువ మంది ఆకర్షితులవుతున్నారు.

బ్రిటానియా బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి

లింటాస్-BBC.GL-10-F40 TL

## ఉత్తరాలు

(5 వ పేజీ తరువాయి)

### రచయిత్రులపై విసుర్లు

ప్రముఖ రచయిత్రీమణులు వ్రాస్తున్న అసంఖ్యాకమయిన ప్రేమకథలు చదివి చదివి ఈ పుత్తరం వ్రాస్తున్నాను. అబ్బాయి, అమ్మాయి చెట్టాపట్టాలేసుకుని తిరిగితే సోషలిజం వచ్చేస్తుందను కొనే ఆమె రచనలు దేశాభ్యుదయానికి ఎంతవరకు ఉపకరిస్తాయని ప్రశ్నించుకొంటే కేవలం సినిమాలకు అంకితం చేసి ఖజానాలు నింపుకోవడానికి మాత్రమేనని సమాధానం చెప్పుకోవాలి. ఇప్పటి రచయిత్రులంతా ఊహ తెలియని పాపాయిలు. ఏది నిప్పో, ఏది నీళ్లో తెలియని అమాయకులు. వీరు మొదటిరాత్రి అనుభవాలు, తొలి ప్రణయాలు తప్పించి ఏమీ వ్రాయలేని అభాగ్యులు. ప్రేమ సందేశాలు మినహా అభ్యుదయ సందేశాలు ఇవ్వడం చేతకాని చిట్టెమ్మలు. దేశపురోభివృద్ధికి సంబంధించిన సంఘటనలను కథలుగా మలచినప్పుడే రచనకు సార్థకత అని గ్రహించాలి. ప్రణయాలను పగటి కలలను మరచిపోవలసినదిగా రచయిత్రులను కోరుచున్నాను.

కె. నారాయణరాజు, (హైదరాబాదు)

### సందేహం

ది. 12.11.76 పత్రిక డాక్టరు సలహా శీర్షికలో "ఏ కాయలైనా, పళ్లయినా పండటం అనేది కొన్ని మాక్రోక్రిములద్వారా ప్రేరేపింపబడే "ఎంజైమాటిక్" అంటే రసాయనిక మార్పులే కారణం అని వ్రాశారు. ఇవి శరీరంలో హానికరమైనవిగా ప్రవర్తిస్తాయని వ్రాశారు. అయితే పాలు, పెరుగు కావటానికి తోడ్పడేవి కూడా సూక్ష్మక్రిములని చెప్తారు. ఈ సూక్ష్మక్రిములు కూడ హానికరములా. పత్రిక ద్వారా తెలుపగోర్తాను.

ఎం. భక్తప్రియాంబ (నందిగామ)





ఈ ఫోటోలోని మెహతాప్ సింగ్ మధ్యప్రదేశ్‌లోని రట్లాం జిల్లా నివాసి. హరిజనుడు. 20 ఏళ్ల నుంచి వెట్టిచాకిరీ చేస్తున్నాడు. ఆస్తులన్నీ అమ్మి రూ. 2000 లు జమ చేశాడు. అయినా అతను తీసుకున్న అప్పు రూ. 300 లు వడ్డీతో సహా ఇంకా రూ. 1800 లు అయింది. వ్యాధిగ్రస్తుడు అయిన ఇతణ్ణి పనిచేయమని యజమాని పెట్టే బాధలు భరించలేక పూరువిడిచి పారిపోయాడు. ప్రభుత్వం వారు ఇతన్ని వెట్టినుంచి విముక్తుణ్ణి చేశారు. కొంత భూమిని ఉచితంగా ఇచ్చి పునరావాసం కూడా కల్పించారు.

**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**


అతి గాఢంగా పనిచేసే అమృతాంజన్
డెర్మల్ అయింట్ మెంట్ తామర, గజ్జి, దురదలు,
దద్దురులు ఇంకా ఇతర సాధారణ చర్మరోగాలను
అమోఘంగా నివారిస్తుంది,
ఈ రోజే ఒకటి కొనండి!
Amrutanjan Ltd's
dermal
Ointment
for
RINGWORM • ECZEMA ETC
అమృతాంజన్
డెర్మల్ ఆయింట్‌మెంట్
అమృతాంజన్ లిమిటెడ్
14/15 లజ్ చర్చ్ రోడ్డు
మద్రాసు 600 004.
మీ చర్మాన్ని
రక్షించుకోండి
SAA/AM/1905 TEL

